రు.

౫ పమిడి అన్నయ్యాచారిగారు బుద్ధవరం
౬ పమిడి పద్మయ్యాచారి మాధవరం
కల్లూరి అరతయ్యాచారి సోమయ్య
అనుగోజు రామయ్య భైర్నపాడు
కొండమహదేవయ్య రావిగూడెము గుత్తి
ఆలేటి హరినారాయణ రావినూతల
పిన్నె వెంకటరామయ్య పొద్దు
[టూరు
ఆసనూరి శీతయ్య రామకృష్ణపురం
విశ్వనాథుల కోటయ్య నిధానపురం
గొంపిచర్ల రాజయ్య గోదాడు
వచ్చవాయి వీరభద్రాచారి కొణిజ
కంపాటి నాగలింగాచారి [ర్ల

గు.

౧ మల్లెల శ్రీరామయ్య
మల్లెల వెంకటరామయ్య
కొత్తా రామయ్య
నాగుబండి రామయ్య పైనేపల్లి
కర్లపాటి సత్యనారాయణ రావిగూ
కోదాడు వెంకటబ్రహ్మం [డెం
చిట్టేల వెట్టెయ్య
రంగు కాంతయ్య గంధశిరి
రామడుగు గుర్వాచారి చింతకాని
చిట్టోజు పుల్లయ్య కొండపల్లి
పమిడి పుల్లయ్య
కన్నెకంటి బుచ్చయ్యాచారి తిమ్మి
[నేని పాలెం
కన్నెకంటి లచ్చయాచారి
కన్నెకంటి శీతయ్య
రంగు వెంకటనర్సయ్య
జయంతి అప్పయాచారి
రంగు వరదయాచారి

రాజిలక నర్సయాచారి
రాజిలక శీతయాచారి
తాళ్లూరి పుల్లయ్య కొండపల్లి
గోమారపు సుబ్బయ్య పెదమండువ
దెందుకూరి నాగలింగాచారి
దెందుకూరి గురులింగాచారి
అడికొప్పుల కోటయ్య
కొండపర్తి పరదేశయ్య ముష్టికుంట్ల
కొండపర్తి పర్వతయ్య
మేరు చంద్రయ్య
గొల్లపల్లి పాపయ్య
నంచర్ల అనంతాచారి
ఆలేటి రామకృష్ణయ్య
పమిడి పాపయ్య మునగాల
పతకముడి సంగయ్య పుట్టకోట
పురిమెళ్ల రంగయ్య
నంచర్ల నర్సయ్యాచారి
విశ్వబ్రాహ్మణులు మొలుకాపురం
సాంపల్లి సుబ్బయ్య అప్పానరశిం
[హపురం
కాటం లక్ష్మినర్సయ్య మాధవరం
చవడం రాజన్న
జంగమేశ్వరపురం చన్నమల్లయ్య
కర్లపాటి అప్పయ్య జాలయ్య
కల్లూరి గుర్వయ్య కుమారై ఈశ్వర
కణితి వెంకటనర్సయ్య వల్లభి [మ్మ
పులిపాటి నాగభూషణం మార్కా
పోల్లనాగమ్మ [పేయ
గాదె క్రిష్ణారెడ్డి బుధవరం
కనకబండి రామచంద్రం
మోతుకూరి లచ్చయ్య గొట్టెల
మోతుకూరి పిచ్చయ్య
నెల్లూరి మల్లయ్య
దండా అనుమయ్య
ఆకం అప్పన్న రావిగూడెం



శుభమస్తు.

శ్రీమ ద్విరా డ్విశ్వకర్మ పరబ్రహ్మణేనమః.

# దేవబ్రాహ్మణమహాత్మ్యము.

## ప్రథమాశ్వాసము.

శ్లో: పంచాననః పంచయుగీ భుజాన్వితః,
ప్రపంచ సృష్టి స్థితి నాశకారణః,
వేదాంత వీథీ విచర న్మహాత్మా,
శ్రీ విశ్వకర్మా పరమేశ్వరో వ్యాత్.

శ్రీమ ద్విరా డ్విశ్వబ్రహ్మ అఖిలాండకోటి బ్రహ్మాండోత్పత్తికారణ విశ్వకర్మ పరాత్పర పాదారవింద జనిత గళిత మిళిత మధురపాన చిత్తసంయుక్త ధీరుండును చతుర్దశభువన వేదవేదాంగ సంశబ్ద శబ్దార్థ విజ్ఞానుండును స్నాన సంధ్యా ద్యనుష్టాన జపతప హోమ నిరతుండును త్వష్టబ్రహ్మ వంశోద్భవుండై శ్రీమ ద్వజ్రాల నాగలింగయాచార్య పుత్రుండును నగుచంద్ర

యాఖ్యంపు అభ్యుదయ పరంపరాభివృద్ధిగా జగత్కీర్తికొఱకు దేవబ్రాహ్మణ మహాత్మ్యమను నొకగ్రంథము జేయ నిశ్చయించి యేతద్గ్రంథము రచియింపుటకు మనస్సాహ్లాదకరంబుగా జేయ నుపక్రమించితి.

సీ. శ్రీవల్లభని నివసించెడి వఙ్జాలయన్వయనాగ లింగాఖ్యగురుడు,
స్నానసంధ్యాదిక జపతపోహోమముల్ నిత్యముల్ దీర్చుచు నియమ విధిని,
భూతేశు కరుణచే భూరికీర్తి నిబొంది విశ్వంబులో దానువినుతి కెక్కి,
వేదవేదాంగసంవేద్యుడై పరిపూర్ణనిత్యసమాధి వినిష్ఠ జెంది,
ఘనత జెందిన దేశికగ్రామణికిని ననుఁగుపుత్రుడనై పుట్టినట్టివాఁడ,
తల్లిదండ్రులకును పెద్దలనుగూర్చి ప్రీతిచేత నమస్కార విధులొనర్తు.

గీ. వేదశాస్త్రోపనిషదర్థవిధివిధాన!
జ్ఞానసంసిద్ధియెంతయుఁ బాలకున్న
యొరులఁజూచియాక్షేపించుమలదు రెవ్వ
డట్టి కుకవుల నేను నిరాకరింతు.

వ. అనియిట్లు శ్రీవిరాడ్విశ్వకర్మ మహాస్తోత్రంబును పంచబ్రహ్మలస్తోత్రంబును సద్గురు వందనంబును యిష్టదేవతా ప్రస్తుతియు పార్వతీపరమేశ్వరధ్యానంబును కుకవినిందయు సుకవిస్తుతియును బ్రహ్మోత్పత్తికారణ విశ్వబ్రాహ్మణుల వందనంబులుంగావించి పినాకరింపంబూనిన దేవబ్రాహ్మణమహత్యంబను సీ ప్రబంధంబునకు నాగరాఖండా స్కాందపురాణాంతర్గతంబగు పార్వతీపరమేశ్వర సంవాదంబు సంక్షేపణంబుగా నుదహరించుటకు విద్యార్ణవ్య భాష్యమును భాగవతంబును శీతారామాంజనేయ సంవాదంబును గురుగీతాసారంబును వుత్తరరామాయణంబును కఠోపనిషత్తులున్ను గోపాలతాపనిషత్తులున్ను మరికొన్ని శృతులున్ను కైవల్య నవనీతమున్ను మరికొన్ని వేదాంత శాస్త్రంబులున్ను సామవేద శృతులున్ను ధ్యానబిందోపనిషత్తుల

న్ను కాండోపవసనమందున్న బ్రాహ్మణస్వత్వమున్ను అథర్వణవేదములోని ఋక్కులున్ను శ్రీకృష్ణమూర్తి అర్జునునకు భగవద్గీతల జ్ఞానముపదేశించెను. అందు సప్తమాధ్యాయమందున్న అర్థమున్ను మూలస్తంభ ప్రమాణములున్ను శ్రుతిస్మృతేతిహాసాది పురాణములన్నియు గ్రహించి శ్రీమద్విరాడ్విశ్వకర్మ అవతరించుటయున్ను విశ్వకర్మ పంచముఖంబులా నిరూపణయున్న పంచముఖంబులలో పంచబ్రహ్మలున్ను పంచాక్షరములున్ను పుద్భవించుటయున్ను పంచాక్షరములకు పంచబ్రహ్మలు అధిదేవతలుగా నుండుటయున్ను మనువంశము విరళించుటయున్ను అనేక మహాయుగములన్నియు పంచబ్రహ్మవంశస్థులయిన విశ్వకర్మలందరు నేలుటయున్ను మనువిశ్వకర్మవంశమందు మయవిశ్వబ్రహ్మ దశావతారములు యెత్తినవృత్తాంతమంతయున్ను త్వష్టబ్రహ్మసరస్వతీ పీఠంబు సృజియించి నిరూపణ గావించుటయున్ను శ్రీమద్విరాడ్విశ్వబ్రహ్మను జీవుండైనవిధంబును చతుర్దశభువనంబులు శ్రీమద్విరాడ్విశ్వకర్మయందు నుండియుండుటయున్ను చతుర్దశమనువులవృత్తాంతమున్ను స్వాయంభువమను విశ్వకర్మ వంశావళియున్ను వైవస్వతమను విశ్వకర్మవృత్తాంతమున్ను గురుదీక్షావిధియున్ను "బహుశ్రుతి పురాణేషు బహుశాస్త్రమోమత" అనునటుల శ్రుతి స్మృతి యితిహాసాది పురాణములన్నియు పరిశోధించి యఖిల విద్వజ్జనాహ్లాదకరంబుగా నుండునటుల రచించుటకు కార్యక్రమం పెట్టితిని.

సీ. భూమియాకాశమున భోమణిశీతాంశుసందళులు బొడమకయున్నయపుడె,
గ్రహములు నక్షత్ర గణముల వహ్నియు పవనరేబు సంభవింపకయమున్న,
బ్రహ్మాదివిష్ణువు సురపతి రుద్ర వసువైత్రసంఘము ఆవిర్భవింపకయమున్న,
గిరులు వృక్షములు కిన్నరులు సిద్ధులు సాధ్యులుగలుగనుపింపకయున్నయపుడె
పొదచరాచర పత్రి తోభువనంబు తతియుంగ కంటకనిరాలంబమైయున్నయపుడె
దాద్యుడవ్యక్తుడచ్యుతుడనగ తాను, తెలి [illegible] యుచుండు పరబ్రహ్మవిశ్వకర్మ

వ. అనియిట్లు విరాడ్విశ్వకర్మ యని స్వరాడ్విశ్వకర్మయని సాంబ్రాడ్విశ్వకర్మయని విరాట్పురుషుండని నిర్గుణుండని నిష్కళంకుడని నిరాకారుడని నిర్వికల్పుడని నిరంజనుడని నిరామయుడని బ్రహ్మానందస్వరూపుడని అంతర్వ్యాపకుడని ఆదిమధ్యాంతరహితుడని పంచభూతాత్మకుడని సర్వవ్యాపకుడని స్వయంప్రకాశుడని పరాత్పరుడని పరంధాముండని పరమాత్మయని పరమేశ్వరుండని పరబ్రహ్మమని విశ్వం [illegible] జని విశ్వంభరుడని విశ్వాత్మకుండని విశ్వకర్త యని విశ్వభోక్తయని విశ్వమూర్తియని విశ్వేశుడని విశ్వకర్మయని యిట్టిపెక్కు నామంబుల [illegible] యావిశ్వకర్మ అవతరించుట.

సీ. అమ్మహావిశ్వబ్రహ్మంబు మహాయుగయుగయుగమ్ములకు సత్యాత్మ యుగ,
మవతరించుచును దానైదుముఖంబుల పంచతత్త్వంబుల బ్రకృతియగుచు,
ముందు సద్యోజాత ముఖమున మనువును వామదేవంబున మయుడు,
రమణ నఘోరముఖమున త్వష్టృబ్రహ్మ తత్పురుషముఖమ్మునఁ దనరు శిల్పి,

గీ. వెలుఁగు నీశానముఖత విశ్వజ్ఞబ్రహ్మ
గలిగ వీరలు పంచముఖమ్ములందు
పంచబ్రహ్మలు పంచాధిపతులునైరి
వినుము మనువంశభవుడ మహీస్థలమున.

క. భుజములందు విష్ణుపూనియుద్భవమయ్యె, హృదయమందు రుద్రుం [illegible]
పదములందు బుట్టె పాకశాసనుడును విశ్వకర్మ జేసె విమల దేవ.

వ. అనియిటుల శాస్త్రదృష్టాంతరములు ఆలోచించగా. నందనీరణ, అనంత, అద్భుత, అద్భుతతమంథా, తారక, అ[illegible], [illegible], అన్యోన్య, అలంకృత, విశ్వావసువ, పరాభవ, సకలధర్మ, సకలస్వరూప. కృతయుగ, త్రేతాయుగ, ద్వాపరయుగ, కలియుగంబులు నాల్గు యుగంబులగును, [illegible]

విరోధిమిదినైన పరిణామపుమనుండు నందనీరణయను ప్రథమ మహాయుగంబునందు విశ్వకర్మ యయిదుముఖంబులచే అవతరించెను. ఆపంచముఖంబు లెట్టివనిన.

శృతిః. సద్యోజాత వామదేవ, అఘోరతత్పురుష, ఈశాన. యనుపంచముఖంబులు.

శ్లో॥ మనుంపూర్వముఖంచైవా। మయానాం దక్షణాముఖం। త్వష్టాపశ్చ ముఖంచైవ। శిల్పికోత్తరముఖంభవేత్। హిరణ్యాపూర్ధ్వకాముఖంచైవ । ఏవజ న్మాక్రమాత్క్రమాత్॥

తా. యీవిశ్వకర్మ సద్యోజాతముఖము యనే తూర్పుముఖముయందు మనువిశ్వకర్మ వుద్భవించెను, వామదేవముఖముయనె దక్షణముఖమందు మయవిశ్వబ్రహ్మ వుద్భవించెను. అఘోరముఖముయనె పశ్చిమముఖముయందు త్వష్టవిశ్వకర్మ వుద్భవించెను. తత్పురుషముఖముయనె వుత్తరముఖముయందు శిల్పిబ్రహ్మవుద్భవించెను యీశాన్యముఖముయనె వూర్ధ్వముఖముయందు విశ్వబ్రహ్మవుద్భవించెను, యీ మను మయ త్వష్ట శిల్పి విశ్వజ్ఞులకును నైదు గోత్రంబులుగలవు.

శ్లో॥ సానగోమనూనామాశ్చ । సనాతనామయస్తథా। అభువనసంచత్వష్టాచ। శిల్పిప్రత్నసమేవచ। సుపర్ణసవిశ్వజ్ఞాచ। పంచబ్రహ్మామయంజగత్॥

మను విశ్వబ్రహ్మ ఋగ్వేదపారాయణంబును ఆదిశక్తియను భార్యయును సానగగోత్రంబును రుక్షాఖయును అశ్వలాయన సూత్రంబును సద్యోజాతప్రవరయు కాలమేఘవాహనంబును ఏకాక్షరీ మంత్రజపంబును నీమయ విశ్వకర్మకు యజుర్వేదపారాయణంబును యిచ్ఛాశక్తియను భార్యయును, సనాతయను గోత్రంబును యజుర్వేదశాఖయూ ఆపస్తంభ సూత్రంబును వామదేవప్రవరయు ఉత్తాలద్రోణమేఘవాహనంబును చతురక్షరీ మంత్రజపంబును; మరియు నీత్వష్టబ్రహ్మకు సామవేదపారాయణంబును అభువనస

గోత్రంబును క్రియాశక్తియను భార్యయును కాత్యాయనసూత్రంబును అఘోరప్రవరయు మహానీలమేఘ వాహనంబును అయిదువర్ణములుగల మంత్రజపంబును, మరియు శిల్పిబ్రహ్మకు అథర్వణవేద పారాయణంబును జ్ఞానశక్తియను భార్యయును ప్రత్నసగోత్రంబును అథర్వణవేదశాఖయును కాత్యాయన సూత్రంబును తత్పురుషప్రవరయు కుంభమేఘవాహనంబును ఆరువర్ణములు గల మంత్రజపంబును, మరియు విశ్వజ్ఞబ్రహ్మకు ప్రణవవేదపారాయణంబును ఇచ్ఛాశక్తియను భార్యయును ఓంకారశాఖయు ఈశానప్రవరయు బోధాయన సూత్రంబును వాయుమేఘవాహనంబును, తొమ్మిదివర్ణములుగల మంత్రజపంబును రెక్కరెక్క కెంగ్గిన పంచయజ్ఞంబులం స్రృజియించెను నవి యాన్వితంబనిన.

శ్లో॥ మనూనాం బ్రహ్మయజ్ఞంచ మయానాం దేవయజ్ఞకం త్వష్టామానుషయజ్ఞంచ శిల్పినాంపితృయజ్ఞకం। విశ్వజ్ఞా భూతయజ్ఞం ... యజ్ఞ ప్రకీర్తితా॥

బ్రహ్మయజ్ఞము మనువిశ్వకర్మదనిన్ని దేవతలు చేయుయజ్ఞము ... విశ్వబ్రహ్మదనిన్ని మానవులు చేయుయజ్ఞము త్వష్టవిశ్వకర్మదనిన్ని పితృయజ్ఞము శిల్పిబ్రహ్మదనిన్ని భూతయజ్ఞము విశ్వజ్ఞబ్రహ్మదనిన్ని యీలాగున ... యున్నది గాన యింకాశ్రుతి సమ్మతముగా వినుపించెదవినుమా.

శ్లో॥ పాఠహోమశ్చాదతీనాం నపర్యాతర్పణంబలిః ఏతేపంచమహాయజ్ఞా బ్రహ్మయజ్ఞాది నామకః॥

వేదపాఠము వైశ్వదేవాది హోమము అతిథిపూజా పితృతర్పణము భూతబలి అనునీఅయిదున్ను పంచ మహాయజ్ఞము ...నంబడును.

శ్రు॥ ధ్యానాధ్యాపనం బ్రహ్మయజ్ఞస్తుతర్పణం, హోమోదైవో బలిర్భౌతో నృయజ్ఞో తిథిపూజనమితిస్మృతః॥

తా॥ వేదపాఠము బ్రహ్మయజ్ఞము హోమము దేవయజ్ఞము అతిథి పూజా మనుష్యయజ్ఞము పితృతర్పణము పితృయజ్ఞము భూతబలి భూతయజ్ఞములనంబడును.

శ్రు. యజ్ఞేనయజ్ఞ మయజంత దేవాః.

అని యున్నదిగనుక యజ్ఞకర్త మయవిశ్వబ్రహ్మయని శ్రుతి సమ్మతముగా తెలియజెప్పుచున్నాను వినుమా.

శ్రు. యత్పూజితం మయా దేవా పరిపూర్ణం తదస్తుతే. అనియున్నదిగనుక శుద్ధపుణ్యాహవాచనముచేయు సమయంబున మంత్రతంత్ర భక్తిక్రియలలో యేదలోపమైనా ఆమయవిశ్వబ్రహ్మపరిహరించగలడనిమిక్కిలిస్తోత్రము చేయుదురుగాని. యింకా భాగవతము చతుర్థస్కంధములో చెప్పియున్న పుట ౧౦౦ ౧౩ పంక్తిన చెప్పియున్నది.

సర్వసౌఖ్యంబులు ప్రాప్తించు లోకపాలకులగువారు సర్వేశ్వరునికొరకు బలిప్రదానంబులు చేయుదురు సమస్తలోకదేవతా యజ్ఞాది సంగ్రహుండు వేదమయుండు ద్రవ్యమయుండు తపోమయుండునగు నారాయణుని విచిత్రంబులయిన యజ్ఞంబులచేత యజనంబుచేసిన నీకు భయంబగు మోక్షంబు గలుగుగావున నీరాజ్యంబున సుఖంబుసేయుమని యాజ్ఞాపింపుము నీదేశ్యంబున జేయించబడిన యజ్ఞంబులచేత హరికళాయుక్తంబులగు దేవగణంబులు యిష్టంబులయి తుష్టంబులగుచు భవదీయ వాంఛితార్థంబు లిచ్చు గావున దేవతా తిరస్కారంబు యుక్తంబుగాదు వేదచోదితంబులగు ధర్మంబులందు నాసక్తుండవు గమ్మనివేనుండిట్లనియె.

అని యున్నదిగనుక యజ్ఞాది సంగ్రహుండని ద్రవ్యమయుడు వేదమయుడు తపోమయుడు దేవమయుండని యిట్టినామములు ఆమయవిశ్వబ్రహ్మమునకే చెల్లునుగనుక ఆమయవిశ్వబ్రహ్మనే యజ్ఞాధిష్టానదేవతగా నాతోని

ముప్పదిమూడుకోట్ల దేవతలందరున్ను యజ్ఞయాగాది హోమములు జేయుచున్నది గనుక యజ్ఞాధిదేవుండగు మయవిశ్వబ్రహ్మ యని నిశ్చయ దృఢీకృతముగా తెలియబడుచున్నది.

| | | | | | |
|---|---|---|---|---|---|
| శ్రీమద్విశ్వకర్మా ఓం | సద్యోజాత ముఖము | వామదేవ ముఖము | అఘోర ముఖము | తత్పురుష ముఖము | ఈశాన ముఖము |
| పంచబ్రహ్మలు పంచాక్షరి ఓం | మనువిశ్వకర్మ న | మయవిశ్వకర్మ మః | త్వష్టవిశ్వకర్మ శి | శిల్పివిశ్వకర్మ వా | విశ్వజ్ఞబ్రహ్మ యః |
| పంచశక్తులు | ఆదిశక్తి | ఇచ్ఛాశక్తి | క్రియాశక్తి | జ్ఞానశక్తి | పరాశక్తి |
| పంచకళలు | నివృత్తి | ప్రతిష్ట | విద్యా | శాంత | శాంత్యతీతం |
| పంచభూతములు | పృధివి | జలము | అగ్ని | వాయువ | ఆకాశము |
| పంచగోత్రములు | సానగ | సనాతన | అభువనస | ప్రత్నస | సుపర్ణస |
| పంచయజ్ఞములు | బ్రహ్మయజ్ఞము | దేవయజ్ఞము | మానశయజ్ఞము | పితృయజ్ఞము | భూతయజ్ఞము |



వీటిలో అకారాదిషోడశస్వరములును జీవాక్షరములును యకారాదిద శాక్షరములును ప్రాణమాతృకాద్బీజాక్షరములును, ఔటచేత వీనిత్రోయగాత క్కిన యిరువదియైదువర్ణములును యిరువదియైదు తత్వములును సకలమయ పాదులును నిర్ణయించియుండుటచేతఁ వీనికి పంచభూతబీజప్రకారముగా పం చీకరణ వ్రాయబడుచున్నది గాన దివారాత్రిజరుగు తిధివార నక్షత్రయోగకర ణ పంచాంగమను పంచకర్తలుగా శృతిస్మృతి నాగరాఖండమందుండు శ్లో కార్ధరీతిగా తెలియజెప్పుచున్నాను నిదితేటగా నీమనస్సు సంశయముదీర ద్బ ఢీకృతముగా వినుమని యిట్లనియె.

శ్లో॥ తిధిరూపమను ప్రోక్తం । వారంచమయసంభవం । నక్షత్రంత్వష్ట రూపంచ । శిల్పియోగతథైవచ । విశ్వజ్ఞాకరణంచైవ । పంచాంగ మధి దేవతా॥

సీ. మాసమతిధులకు మనుబ్రహ్మకర్తయయి సప్తమవారంబు మయుడుకర్త
నక్షత్రమునకు తాత్వష్టబ్రహ్మయుకర్తయోగమునకు శిల్పిబ్రహ్మకర్త
కరణంబునకుతాను విశ్వజ్ఞబ్రహ్మయు అధిపతులైవీరువృధివియందు
తిధివారనక్షత్రయోగకరణంబులు పంచబ్రహ్మలెకానివేరులేదు
గానవీరలుపంచాంగమూర్తిదేవరుల, దూషణలుజేయుదుర్జనగాధలవుండు
నిట్టివారికిమోక్షంబుగలుగరాదు. నిదియెపంచాక్షరియంత్రనిశ్చయముగా.

శ్రీమద్విరాడ్విశ్వకర్మ అగ్రకుమారుండయినమను విశ్వబ్రహ్మయు న్న మయవిశ్వబ్రహ్మయున్న త్వష్టవిశ్వబ్రహ్మయున్నశిల్పి విశ్వబ్రహ్మ యున్న విశ్వజ్ఞ విశ్వబ్రహ్మయున్న వీరుఅయిదుగురున్న విశ్వకర్మాగ్రనం దనులై విశ్వరక్షకులైవుండిరి,

శృతి॥ పంచమహాబ్రహ్మోభ్యో అఖిలంజగత్తు, అనియున్నదిగనుక జీవా త్మబరుండరయెనసర్వమయుండుతనమాయచేత విశ్వంబుసృజింపగోరినట్టు సత్త

మెసక్క-రథకు ప్రథమములో జెప్పియున్నదిగాన. యీపంచబ్రహ్మలుప్రపంచ కము సృజియింపబడిరి, అదియెట్టిదనిన.

శ్లో॥ విశ్వకర్మా సదానందో పంచాస్యోమేరునిర్మితాః। పంచబ్రహ్మాధి రూపస్య। మల్లికాంబరవాహన। మైత్రావరుణాభిద్వేషో। ధృవపాలోజగద్గు రుః। శంభుసాక్షీ పంచవేదతథాతస్య ముఖోద్భవ। మనుర్మయాచత్వష్టాశిల్పి విశ్వజ్ఞమూర్తయే। కంసాలోశ్రీహరేనామ బ్రాహ్మణోహరికేతనః॥

తా. విశ్వకర్మసదానందుడనిన్ని పంచబ్రహ్మలు మహామేరునిర్మితుల నిన్ని మల్లికాంబరవాహనులనిన్ని శంభుసాక్షిగా పంచపాలకులనిన్నియీపం చపాలకులు దేవతావివాహమందుగాని బ్రహ్మక్షత్రియ వైశ్య వివాహోపన యనకాలమందుగాని పంచబ్రహ్మల ఆవాహన ప్రత్యామ్నాయము పంచపాల కులనిర్మించి ధాన్యసమేతముగానుంచి పంచవృక్షములుగా పూజించుచున్నారు గ నుక యీపంచపాలకులనే పంచవృక్షములు పంచబ్రహ్మలుగా నెరుంగుము.

శ్రుతి॥ పంచశీర్షేణ పుపనయనేవినియోగః, దయివగాయిత్రీఛందః, అ నగా మనుమయత్వష్టశిల్పి విశ్వజ్ఞలనెడునరు విశ్వబ్రాహ్మణుల ప్రత్యామ్నా యము పుపనయనకాలమందు పంచశిఖలుగా బ్రహ్మక్షత్రియ వైశ్యులు తమ యొక్క శిరసాధరించుకొని శిఖాయజ్ఞోపవీతంబులధరించబడిరి.

శ్రుతి॥ ఆపోర్ధ్వపనా స్వరమితి, రిత్రోవిశ్వకర్మా, యజ్ఞధాతా, విధా తా, పరమచంద్రికా,బ్రహ్మతిష్టాత్తు, యజ్ఞోపవీతం పరమంపవిత్రం ప్రాజాపతే ర్యత్సహజం, పురస్తాత్తు, ఆయుష్యమగ్రియం, ప్రతిముంచశుభ్రం యజ్ఞోపవీతం బలమస్తుతేజాః, అనగా, ప్రస్తుతము.

శ్రుతి॥ ఆపోర్ధ్వపనా స్వరమితి.

అనేశ్రుతిసాంగము జెప్పజాలక మధ్యనుంచి యజ్ఞోపవీతం పరమంప విత్రం అనితమయిష్టప్రకారం జేయుచున్నారు. అదియెందువల్లనంటె, విశ్వ

కర్మోపనిషత్తులున్ను శృతిస్మృతియితిహాసములున్ను అనాదిసమయమునుంచి యున్న
శృతులభేదించి తమసూత్రము మధ్యకాలమునుంచి జెప్పుకొనుచున్నారు. గనుక
కంసాలో శ్రీహరేనామ అన్నందుకు కం అనగా ఆకాశమునకు అర్థము కం అన
గా వుదకమునకర్థము ఆకాశము అనవిష్ణుపదమునకు అర్థము, విష్ణుపదమన
గాయవ్వరనిన.

శ్లో॥ మనుశ్చయీశ్వరోనామ । విష్ణునామమయ స్తథా । బ్రహ్మనామభవే
త్వష్టా । శిల్పిమాహేశనామచ । తక్షోపసూర్యనామశ్చాత్ । విశ్వకర్మ్మాగనందన॥

మనువిశ్వబ్రహ్మ కళరుద్రుడనిన్ని మయవిశ్వబ్రహ్మకళ విష్ణువనిన్ని
త్వష్ట విశ్వబ్రహ్మకళ చతుర్ముఖబ్రహ్మనిన్ని శిల్పివిశ్వబ్రహ్మకళ దేవేంద్రుడ
నిన్ని విశ్వబ్రహ్మకళ సూర్యుడనిన్ని శాస్త్రములు బలుకుచున్నవి గనుక కంసా
లఅను అర్థమునకు మయవిశ్వబ్రహ్మయును విష్ణుపదమె ఆకాశము సాలఅన
గా బ్రంహ్మాండమునకు అర్థము శాస్త్రదృష్టాంతరములు తెలియబడుచున్నవి
గనుకవోయి సద్గుణశ్రేష్టానీ మనస్సు ననిశ్చలభక్తిగలిగి వినుమనితద్వృత్తాంత
మంతయుదెల్పితి యిందువలన కంసాలో శ్రీహరేనామ బ్రాహ్మణోహరికేతనః
అనియున్నందుకు......సప్తమస్కంధము ౪ ...౫ అని మరియు నాహారనిద్ర
లుమాని చిత్తంబులుపరాయత్తంబులుగానీక సమహితబద్ధులయి భగవంతుండు
ను మహాపురుషుండునునైన మహాత్ముండును విశుద్ధజ్ఞానానందమయుండునునయి
న హృషీకేశునకు నమస్కరించుచున్నయెడ మేఘసమగంభీరనినదంబునది
శలుమ్రోయించుచు సాధులకభయంబు గావించునదృశ్యమానుండును గాక పర
మేశ్వరుండయిన శ్రీహరియిట్లనియె గనుక మయవిశ్వబ్రహ్మయెను శ్రీహరినా
మమె బ్రాహ్మణోహరికేతనః అనియున్నదిగనుక, మయవిశ్వబ్రహ్మయును శ్రీ
హరిని బ్రహ్మక్షత్రియవైశ్య శూద్రులున్ను శ్రీహరికీర్తన జేయుచున్నారు. నో
నుగ్రహోతమా.



శ్రుతి.॥ దేవదేవమహాదేవా విశ్వకర్మా జగద్గురుః విశ్వకర్మసుతానాంచ విశ్వలోకాదిపాలనః.

సీ. విశ్వకర్మకొమరులౌ మనువాగ్రజుండేలె శతకోటిభూమియు శంఖములను
మయబ్రహ్మయునేలె శతకోటిభూమియు సమభాగమునతాను శంఖములను
త్వష్టబ్రహ్మయునేలె శతకోటిభూమియు ఆచార్యనధిపుడై శంఖంబులెల్ల
శిల్పిబ్రహ్మయునేలె శతకోటిభూమియు వైభవంబున శంఖంబులెల్ల
యిటుల నేలెను విశ్వజ్ఞ నూరుకోట్లు, శంఖలేకను శంఖంబునేలెనతడు
విశ్వకర్మయుకొమరులు విశ్వమంతా, నేలెపంచాశత్కోటిభూమండలంబు.

యీవరుసను పంచబ్రహ్మలు పంచాశత్కోటిభూమండలంబు నేలుచున్న సమయంబున విశ్వకర్మాగ్ర కొమారుండయిన మను విశ్వబ్రహ్మ చతుర్దశమనువులను సృజియించెను. వారలెవ్వరనిన. స్వాయంభువమనువు స్వారోచిషమనువు వుత్తమమనువు తామసమనువు రయివతమనువు చాక్షుసమనువు వైవస్వతమనువు దక్షసావర్ణికమనువు సూర్యసావర్ణికమనువు బ్రహ్మసావర్ణికమనువు రుద్రసావర్ణికమనువు ధర్మసావర్ణికమనువు రౌచ్యమనువు యింద్రసావర్ణికమనువు.

యీపదునలుగురు మనువిశ్వకర్మలు విశ్వకర్మాసద్యోజాత ముఖోద్భవుండగు మను విశ్వకర్మకొమాళ్ళయనే తెలియబడుచున్నది. గనుక, భాగవతమందు యీపదునలుగురు మనువులవృత్తాంతము చతుర్ముఖబ్రహ్మసంతతియని సంస్కృతార్థముగా వుండబడినటువంటి స్వాయంభువునిసంతతియనిన్ని చెప్పబడియున్నది, అనగా స్వాయంభువుండు కేవలం విరాడ్విశ్వకర్మయనె తెలియబడుచున్నదిగదా.

శ్రుతిః॥ స్వయంభో విశ్వకర్మణః.

అనియున్నదిగనుక మనువులను కొమాళ్లయని చెప్పుటకు శాస్త్రవిరుద్ధముగానున్నదిగనుక యీచతుర్దశమనువులు చతుర్ముఖబ్రహ్మసంతతియని చెప్పు

టకు శాస్త్రసమ్మతము గానేరదుకాబట్టి యీమనువులందరున్నూ మనువిశ్వక ర్మసంతతియనే తాత్పర్యము.

చతుర్దశమనువిశ్వకర్మలకు చతుర్దశవేదములవివరణచక్రము.

| | | | |
|---|---|---|---|
| ఓం విశాడ్విశ్వకర్మసజ్యోజాతముఖోద్భవుండైనమనుబ్రహ్మ | యీమను విశ్వబ్రహ్మఆదిశక్తి సుపుత్రా చతుర్విద్యలు | స్వాయంభువమనువిశ్వకర్మాము శ్వేదపారాయణము | స్వారోచిషమను విశ్వకర్మయజుర్వేదము |
| వుత్తమమను విశ్వకర్మ సామవేదము | తామసమను విశ్వకర్మ అథర్వణవేదము | రైవతమనువిశ్వకర్మశిక్షయు | చాక్షుసమను విశ్వకర్మవ్యాకరణము |
| వైవస్వతమను విశ్వకర్మచందస్సు | సూర్యసావర్ణికమనువిశ్వకర్మనిరుక్తము | దక్షసావర్ణమనువిశ్వకర్మజ్యోతిష్యము | బ్రహ్మసావర్ణికమనువిశ్వకర్మశిల్పశాస్త్రము |
| రుద్రసావర్ణికమనువిశ్వకర్మమీమాంసశాస్త్రము | ధర్మసావర్ణికమనువిశ్వకర్మన్యాయశాస్త్రము | రౌచ్యమనువిశ్వకర్మపురాణశాస్త్రము | యింద్రసావర్ణికమనువిశ్వకర్మధర్మశాస్త్రము |

యీపదునలుగురు మనువిశ్వకర్మలను గూర్చి వక్రనతమును చేయుచున్నారు అదియెట్లనిన యిందుకు శృతి సమ్మతముగా చెప్పుచున్నాను వినుమని యిట్లనెను॥

శృతి॥ కిమనంత్తమితి, ఉత్పత్తి, వినాశ, రహిత, మనంత, సర్వోపాధివినిర్ముక్త, మృద్ఘటాదివికారేషు, మృత్తికైవ, స్వర్ణవికారేషు. స్వర్ణవివ,తం

తువికారేషు. తంతురివ, అవ్యక్తాది, సృష్టిప్రపంచేషు, వ్యాప్య. పూర్ణమవి
నాశిచైతన్యం, మనంతం॥

అక్షరం వ్యాపదం రూపం, మాద్యంతం,. విశ్వకర్మణః॥

అనంతవ్రతము అని సర్వలోకులున్ను జేయుచున్నారు యీభూలోకమం
దు నదులయందున్ను లేక తటాకములయందున్ను లేక దేవాలయములయందు
న్ను మరిన్ని వనాంతరములయందున్ను జేయుచున్నారు యీమను విశ్వబ్ర
హ్మసంతతిన్నైన చతుర్దశమను విశ్వకర్మలకు ప్రత్యామ్నాయము పదునాల్గు
ముళ్ళుగల పట్టుతోరములున్ను పదునాల్గు పోకచక్కలున్ను అనంతుడనే నామ
ముగల రెండు దర్భలున్ను మనువిశ్వకర్మకు ప్రత్యామ్నాయము కలశమున్ను
యీ మనువిశ్వకర్మతండ్రియౌ అనంతుడు యీవిశ్వకర్మకు అనంతనామములు
గనుక అనంతపద్మనాభ వ్రతమని దేవతలున్ను ఋష్యాదులున్ను
యీకలియుగంబున బ్రహ్మక్షత్రియ వైశ్య శూద్రులున్ను జేయుచున్నారు వో
యినుగుణశ్రేష్టా శాస్త్రదృష్టాంతరములు శోధించగా వేదశృతి పురాణేతిహాస
ములవల్లను తెలియబడుచున్నవి.॥

స్వామీ చక్కల దొరనామధేయా యీవ్రతము అనంతపద్మనాభుడని
వాసుదేవుడని అచ్యుతుండని శ్రీకృష్ణుండని సనాతనుండని, ఉపేంద్రుండని, విష్ణువని,
గోవిందుండని, చెప్పుచున్నారుగాని విశ్వకర్మ యనియవ్వరున్ను చెప్పజాలరు
గదా యీసందేహమేమి॥

వోయినుగుణశ్రేష్టా వినుపించెద॥

ఉ॥ ఎక్కడనున్నవాడు జగదీశ్వరుడాత్మమయుండుమాధవుం
డెక్కడికేగిశాంతులు మునీశులు భిక్షులురారు క్రమ్మరం
డక్కలునెల్లనెక్కడతుదిం జనదిక్కగునట్టిదిక్కగా
నెక్కడవేసుహా సన్యాసముల్ముకుశోభించి మదీయ రక్షకం॥

మయవిశ్వబ్రహ్మయైన మాధవుండైన ఆత్మమయుండైన శ్రీహరి అనేక నామములచే తప్రకాశించుచుండెను.

శ్రీకృష్ణః కమలనాభో హాసు దేవో సనాతనః॥

సనాతనామయ స్తథా, విష్ణునామమయ స్తథా॥

శృతిః॥ శ్రీకృష్ణః కమలనాభో హాసు దేవో సనాతనః॥

అని సహస్రనామములయందు ప్రఖ్యాతిగా జెప్పియున్నదే సనాతను డనగా మయవిశ్వబ్రహ్మయాను యీమయవిశ్వబ్రహ్మ విష్ణుమూర్తి ఇతనే శ్రీకృష్ణుడు యీకృష్ణుడె విశ్వకర్మ।

శ్లో॥ దేవయక్షమనుష్యానాం రాక్షసానాంసదాసుఖం। క్షుత్పిపాస్వాభివృత్యర్థం భవేయుబ్రంహ్మ్ర శోముఖాత్తు। సనాతనోమయందేవంకశలో నిర్మితంపు రాః॥ హలాదినాంతుకర్తవ్యం మదిరాణాంవిశేషితః। స్యందనాదనానానిక్రియతోపవురుషంసహః॥దైవర్నామనుస్మృశో తోష్యేకర్తవ్యం। జగృహె విభాదధాతివా-మసంచారవిమానాంశుభనాకః॥ సనాతనోస్వయంవిష్ణువిష్ణుదేవోసనాతనః।మయాసనాతనోవిక్యాతప్రాయసర్వసనాతనః॥సనాతనోజగత్ కర్త సనాతనోజగధితః। సనాతనోజగద్రక్ష - జగత్పోషసనాతనః॥ సనాతనోమయోర్నామ మయమాయోప్రకీర్తితా। మయోజగన్మయంలోకేవక్షతెప్రాఃక్సురాతనై॥ స్వరంత్యజ్ఞాఫలంస్యాలాం మయంసర్వసనాతనః। ధరంతీ సర్వరూపాణి- నిమిత్తందుష్టనిగ్రః॥

మూలస్తంభ శ్లోకానురీతిగా జెప్పబడెయున్నది. గనుక విష్ణువైనమయవిశ్వబ్రహ్మమహాత్తును నెంచశక్యముగానేరదు॥

గీ॥ అవ్యయుండవనంతుండవత్యుండ వాదిమధ్యాంత సూన్యుండ వఖలధృతిని నిఖలమందెల్ల వర్తింతువనీవుడిగిలి నిఖిలమెల్లను నీయందనెగడుకృష్ణా॥



అని యీప్రకారముగా జెప్పియున్నది గనుక యిట్టినామములను స్మరించెసామర్థ్యతేవున్నది గాని విరాడ్విశ్వకర్మ యనేనామమును స్మరించుటకుసామర్థ్యతచాల సేరదు అదియెందువల్లనంటె ముందుయుగమహాత్యములో తెలియుబడుచున్నది. అనంతనామములు గనుక అనంతపద్మనాభ వ్రతమునేజేయుచుండిరి. స్వామీ యిక్కడనొక సందియంబుదోచుచున్నది. యీఅనంతుడు శ్రీమద్విరాడ్విశ్వకర్మయనుమనువిశ్వకర్మ కలశమునిన్ని జెప్పియుండియుక్రూడ మయవిశ్వబ్రహ్మయని జెప్పుటకు కారణంబేమి? యిదినాకుసందేహముగానున్నది? తెల్పుమని విన్నవించితివి? వోయి సుస్థిరతేజోనిధి నీవు గొప్పసందియంబును నడిగితివి. వినుపించెదను వినుము॥ యీ మయవిశ్వబ్రహ్మయగు శ్రీవిష్ణుమూర్తిరామావతారమునెత్తి మనువిశ్వబ్రహ్మవంశమందువుద్భవించెను అట్టిసమయంబు నవిష్ణుమూర్తియైన శ్రీరామమూర్తిని మయవిశ్వబ్రహ్మయనుటకు యేసందియంబును లేదు।

సీ॥ మనువుల నడవళ్ళుమర్యాదలనువింటి మనువంతరంబునమాధవుండు॥
ఆమనువిశ్వబ్రహ్మమునందె మాధవుండయిన శ్రీవిష్ణుమూర్తి రామావతారమెత్తెను

క॥ బహుమాయుడైన మయుచె। విహితంబగు హరునిజయము విఖ్యాతజయా
వహముగ నీభగవంతుడు। మహితాత్ముడు మున్నొనర్చె మనుజవరేణ్యా॥

గనుక యీ మయవిశ్వబ్రహ్మ బహుమాయకుడట అనగా అనేకమైనమాయలుగలవాడు యీ మయవిశ్వబ్రహ్మయని భాగవతార్థమందు నిశ్చయదృఢీకృతముగా జెప్పబడుతున్నదే॥

సీ॥ కల్పాంతమున నంధకారసంభృతమైన జగమునెవ్వడుదన స్వప్రకాశ
మునదెలిగించుచు మూడుఖండగుల రజస్సత్వతమో గుణరహితుడగుచు



గల్పించరక్షించుగడపటబ్రహరించు నెవ్వడాద్యుడు సర్వహేతువగుచు
శోభితుండైస్వయంజోతియై యొక్కటవిలసిల్లునెవ్వడు విబుధమెరశి
సమయమైనట్టిమాన సత్ప్రాణవిబుధీం ద్రియంబులతోడ నెవ్వడలఘుమహిమ
నడరునట్టిసచ్చిదానందమయునకు మహితభక్తినేనమస్కరింతు॥

అని యిటుల ప్రహలాదుండూ సచ్చిదానందమయ విశ్వబ్రహ్మమైన శ్రీ హరినిగురించి అనేక స్తోత్యంబుచేశి నందువలన అతనికి ఆదేవమయ విశ్వ.బ్రహ్మమైన శ్రీహరిప్రత్యక్షమయి ప్రహలాదుండైన బాలుని భక్తిమెచ్చి యాబాలునకు వైకుంఠసంప్రాప్తియిచ్చెను గాన॥

వోయిసుగుణోత్తమా మనువిశ్వబ్రహ్మ అగ్రకొమారుడయిన స్వాయంభువమను విశ్వకర్మవంశావళిటూకి వివరించుచున్నాను వినుమనియిట్లనిరెను॥

భాగవతము పంచమస్కంధము ప్రధమాశ్వాసము.

గీ॥ సత్యసంధుడైన స్వాయంభువుండను మనువుబ్రహ్మచేతమన్ననదనగ
నందియంతనారదాను మతంబునదనదనుతునిరాజ్యముననునిల్పి ॥

తా॥ సత్యసంధుడయినటువంటి స్వాయంభువమను విశ్వకర్మను తండ్రియైనమను విశ్వబ్రహ్మమన్ననజేసి పంచవేదశ్రుతిస్మృతేతిహాసాది కావ్యతర్క వ్యాకరణ మీమాంసశాస్త్రంబులను జెప్పించి విలువిద్యలను నేర్పుగాజెప్పించి అతనికిరాజ్యపట్టాభిషేకంబు జేశితనరాజ్యంబునిల్పి॥

యిట్లు స్వాయంభువమనువు భూపరిపాలనంబునకు ప్రియవ్రతునికిపట్టంబుగట్టి విషమంబులగు విషయంబులను విషసముద్రాశవిముక్తుండై వనంబునకు జనియెనంత.

ఇట్లుప్రియవ్రతుండు రాజ్యంబుజేయుచు విశ్వకర్మప్రజాపతి పుత్రియగు బహిష్మతియగుదాని పత్నిగాబడసెను యాసతివలన శీలవృత్తగుణరూపవ

ర్యంధైర్యంబులం దనకు యాఘ్నీధ్రైర్యజిహ్వ యజ్ఞబాహుమహావీరహిరణ్యరేతోఘృత వృష్టసవనమేధాతిథిపీతి హోత్రకవియన నామంబులు గలపుత్రశతకంబు నూర్జస్వతియను నొక్కకన్యకం గాంచె నందుకవిమహావీరసవనులు మువ్వురు బాలకులయ్యు నూర్ధ్వరేతస్కులై బ్రహ్మవిద్యానిష్టాత్ములై యుపశమశీలురగుచుం బరమరహస్యయోగంబాశ్రయించు సర్వజీవనికాయావాసుండు భవభీతశరణ్యుండు సర్వాంతర్యామియు భగవంతుండు నగు వాసుదేవుచరణారవింద విరతస్మరణా విగళిత పరమభక్తియోగానుభావంబున విశోధితాంతఃకరణులగుచు నశ్వాసతాదాత్మ్యంబు బొందిరంత ॥

యీస్వాయంభువ మనువిశ్వకర్మ ఏకాదశఅర్బుదంబులు రాజ్యంబుపరిపాలన జేసినదృష్టాంతరము నః అగుపడుతూవున్నది.

యీస్వాయంభువమను విశ్వకర్మ కొమార్తెయగు నూర్జస్వతి నొక్కకన్యకను భార్గవునకునిచ్చెను యీభార్గవునకు నూర్జస్వతియందు దేవయానయను కన్యకారత్నంబు జన్మించెను యీదేవయానయను కన్యకను యయాతిరాజు కొనంగెను యీస్వాయంభువమను విశ్వకర్మ కొమాళ్ళు పదుగురునకు నొక్కొక్కద్వీపంబునకు పట్టణంబుగట్టి పట్టాభిషేకంబు గావించెను యీపదుగురిలో యాఘ్నీధ్రుండను విశ్వకర్మ బహుకాలంబు రాజ్యంబునేలిన దృష్టాంతరము సహభాగవత పంచమస్కంధప్రథమములో మొదలిడుచున్నది.

అనియిట్లుప్రఖ్యాతిగా జెప్పియున్నదిగనుక యీవిశ్వకర్మ ముఖోద్భవుండగు మనువిశ్వబ్రహ్మ సప్తమ కొమారుండైన వైవస్వతమను విశ్వకర్మకు యిక్ష్వాకు వుద్భవించెను.

ఈయిక్ష్వాకుశతతనూజులలో విజయవుపండవికుక్షియనెడు ముగ్గురుసుతులు హిమాచల పర్వతమధ్యస్థలియందు నేలుచున్న సమయమున వికుక్షికపురంజనుడుగలిగె ఈపురంజనునకుయింద్రబాహుడు కాకుస్థుడుద్దరుజనించిరి కాకుస్థునికి పృథుజన్మించె పృథునకు



విశ్వగంధుడు - విశ్వగంధునకు చంద్రుడు - చంద్రునకు వాయునాపృథుడు - వాయునాపృథునకు - నాభర్గ - నాభర్గకు బృహద్భాన్యుడు - బృహద్భాన్యునకు కువలయాశుడు - కువలయాశునకు - దుంధుమారుడు - దుంధుమారునకు - పృథాస్యుడు - పృథాస్యునకు హర్మన్యుడు - హర్మన్యునకు - నికుంభి - నికుంభికి - బరిహినాపృథుడు - బరిహినాపృథునకు - గృతాశ్వుడు - గృతాశ్వునకు - సౌనజిత్తు - సౌనజిత్తునకు - పురికుత్సుడు పురికుత్సునకు - మాంధాత - మాంధాతకు - అంబరీషుడు - అంబరీషునకు - యువతనాపృథుడు - యువతనాపృథునకు - హారితుడు - హారితునకు - పురికుత్సుడు - పురికుత్సునకు - త్రిధన్యుడు - త్రిధన్యునకు - త్రిబంధుడు - త్రిబంధునకు - నరణ్యుండు - నరణ్యునకు - త్రిసంధుడు - త్రిసంధునకు - సత్యవ్రతుడు - సత్యవ్రతునకు - త్రిశంఖుడు - త్రిశంఖునకు - హరిశ్చంద్రుడు - హరిశ్చంద్రునకు - లోహితుడు - లోహితునకు - చంపక నామధేయుడు - చంపక నామధేయునకు - సగరుడు - సగరునకు - హాళవంతుడు - హాళవంతునకు - దిలీపుడు - దిలీపునకు - భాగీరథుడు - భాగీరథునకు - మూలకుడు - మూలకునకు - దశరథుడు - దశరథునకు - సైనవిశ్లు - సైనవిశ్లునకు - విశ్వనహుషుడు - విశ్వనహుషునకు - ఖట్వాంగుడు - ఖట్వాంగునకు - దీర్ఘబాహుడు - దీర్ఘబాహునకు - రఘువు - రఘువునకు - బుధశ్రయుడు - బుధశ్రయునకు - అజుడు - అజునకు - దశరథుడు - దశరథునకు - శ్రీరామలక్ష్మణ భరతశత్రుఘ్న యను నామములచె నలువురు గలిగిరి.

శ్రీమద్విరాడ్విశ్వకర్మాగ్రకొమారుండైన మనువిశ్వబ్రహ్మకూ సద్వర పుత్రుండయిన వైవస్వతమను వంశమునందు. నవమస్కంధము...౫౮......సురప్రార్థితుండైన పరబ్రహ్మమయుండయిన హరి. మయవిశ్వబ్రహ్మయయిన శ్రీహరి నాలుగువిధంబుల రామలక్ష్మణ - భరతశత్రుఘ్న యను నామంబులని జాంశ సంభూతుండయి జన్మించెనని జెప్పియున్నదిగనుక.

శ్రీమద్విరాడ్విశ్వకర్మవాసు దేవముఖోద్భవుండయిన మయవిశ్వబ్రహ్మ యయిన శ్రీహరి నాలుగువిధంబుల జన్మించి శ్రీరామమూర్తి - అయోధ్యాపురీశు

ట్టాభిషిక్తుండై రాజ్యంబు నేలుచున్న సమయములో రాక్షసాగ్రజుండైన రావణ బ్రహ్మ సీతను చెరగొనిపోయి లంకలోనుంచుకొనియున్న సమయంబున శ్రీరాములవారు పశ్చాత్తాపంబునొందియుండగా పితామహుండయిన మనువిశ్వకర్మ స్వప్నావస్థయందు ప్రత్యక్షమై వోయిరామా నీవు శీఘ్రముగా సముద్రముయందు వారధిబంధించి నీవు డెబ్బదిరెండువేల కపిసేనతో యింకా కొంతకాల్బలముతోపోయి యుద్ధరంగముజేశి వానితోజయించి ఆరావణబ్రంహ్మను వధియుం తనంప్రాప్తిగాజేసుకొని నీవుశీఘ్రముగా మాయాసీతను మరలయప్పటివలెచేకొని శీతాసమేతులయి అయోధ్యాపురి పట్టాభిషిక్తుండవయి రాజ్యంబునేలుమని మీవుచరిచినీవు పశ్చాత్తాపంబునొంది యుండుట పనిలేదుగనుక త్వరితముగాలెమ్మని పితామహుండయినమను విశ్వకర్మ అంతర్ధానంబాయెను.

అప్పుడు శ్రీరామమూర్తి మేలుకొని బహుఆలోచనపరుండై సంతోషభరితుండయి యప్పటివలె కొలువుకూటంబునకువచ్చి రత్నసింహాసనాశీనుండైయిట్లనిరి.

శ్లో॥ మనువంశకులేరత్నా మనూఆచార్యదీక్షితాం। కులగురోదేవతాచార్యా। వర్నబ్రహ్మ ధీయతే॥

అనిపిగురువిశ్వబ్రాహ్మణులకులదేవతలుగా ఆధారముగొనిసంతతార్చన షోడశోపచార పూజలుజేయుచు తమమనోభీష్టముగోరి విన్నవించి యిట్లనిరి.

తన ఆచార్యులైన వర్నబ్రహ్మనున్న మంత్రిసామంత పౌరోహితులనున్న అష్టప్రధానులనున్న గరుడగంధర్వసిద్ధవిద్యాధర కిన్నర కింపురుషులనున్న పిలుపించి యీసభాగ్రులందరిని పరిషద్దీర్చి తనకుజరిగినస్వప్నావస్థయు పితామహుండయిన మనువిశ్వకర్మ ప్రత్యక్షమైజెప్పిన విధంబంతయునెరింగించెను యీసభాగ్రులందరు సంతోషించి శీఘ్రముగా సముద్రముయందు వారధిబంధించుమనిజెప్పినవిని అప్పుడు శ్రీరామమూర్తి సముద్రముయందువా

రధిబంధించి శ్రీరాములవారున్ను డెబ్బదిరెండువేలకపిసేనాకాల్బలములతోబ యలువెళ్ళి సముద్రంబు దాటిలంకాపురిపట్టణంబుక్రమ్మకొనియున్న సమయం బున రావణబ్రహ్మ శ్రీరాములవారువచ్చి ముట్టడించియున్న సవిస్తారంబంత యువిని యిట్లనియె.

శ్లో॥ అప్సుస్లావంతిపాషాణం । రాక్షసాఘ్రంతుమానుషః । కపయఃకర్మ కురువంతకాలశ్చ కుటిలాగతిః॥

అనియున్నదిగనుక, సముద్రముయందు వారధియట్లాగట్టెను యీసముద్ర ముయందు పర్వతములున్ను కొండలున్ను దాటి యెట్లువారధిగట్టిరి రాక్షసుల కుఅగ్రజాః రాజునైవుండి కపయఃకర్మకురువంతి అయినా అనుభవించవలశి యున్నదో కాలశ్చకుటిలాగతిః. కష్టకాలము సమీపించియున్నదోఅయినా రా బోవుకాలమునకంటె గతకాలంబు మేలూఅనియున్నదిగనుక జరిగినకాలం బు త్తమమని జరుగుకాలము దుర్లభంబని యీరావణబ్రహ్మ నిర్వాణుండయి యుండగా.

శ్రీతాపతియైన రామమూర్తి అతనితో యుద్ధరంగముజేసిఅతనితోజయిం చి యీరావణబ్రహ్మను వైకుంఠసంప్రాప్తిగాజేశను. అప్పుడూశ్రీరామమూర్తి శ్రీతాదేవిని చేకొని మరలయప్పటివలె అయోధ్యాపురి పట్టాభిషిక్తుండైరాజ్యం బునేలుచునుండెను.

రావణబ్రహ్మతమ్ముడైన విభీషణునికి లంకాపురిపట్టాభిషేకంబు గావిం చి యప్పటివలె రాజ్యంబునేలించెను.

యీప్రకారముగా నాగరాఖండమందు జెప్పియున్న అర్ధము వోయి సుగోత్తమాయని పలికినవిని సంతశించి, స్వామీనాకుఒకసందేహముగాయున్న ది యీసందేహంబు యేమియనిన యీశ్రీరాములవారికి అన్యకులస్తులైనరుషు లేగురువులనిన్ని వీరలె ఆత్మజ్ఞానబోధాచార్యులనిన్ని అనేకశాస్త్రపురాణేతిహా

సములయందున్ను భారత భాగవత పురాణ గీర్వాణములయందున్ను ప్రఖ్యాతిగా బహుదృష్టాంతరములు సకలార్థదర్పణముగా కనబడుచువున్నవిగనుకయీ సందేహము నిస్సందేహముగా దెల్పుమనిన గురుస్వామియిట్లనియె.

క॥ ఘన దేవమయుడు గురుడని యనవరతము గొలుచుకంటె నధికముగలదా.

అనియీప్రకారముగా శ్రీసాంబమూర్తి పార్వతీదేవికి బోధజేయుచున్నాడు యేమనగా మయవిశ్వబ్రహ్మమైన దేవమయుడు గురుండనితలచుటకంటె నధికములేదని పార్వతికి యీశ్వరుడు బోధజేయుచున్న దృష్టాంతర మగుపడుతూవున్నది యీపార్వతీదేవికి మయవిశ్వబ్రహ్మమైనా శ్రీరామతారకమంత్రోపదేశించిన దృష్టాంతములు శ్రీసీతారామాంజనేయసంవాద సహ దృష్టాంతరములూ అగుపడుచున్నవి గనుక.

క॥ నిజముగ పంచాధీశ్వరు, సృజియించిరి సురలనెల్ల నెలతరొవినవే,
నాచార్యులుగావాళ్లకు, యిచ్చిరి మోక్షంబు పదవివినవేగాకి.

తా. యీపంచాధీశ్వరులనగా పంచబ్రహ్మలు వీరలె ముప్పదిమూడుకోట్ల దేవతలను సృజించిరియీదేవతులకూ యీపంచబ్రహ్మలె ఆచార్యులైవున్నారు.

దేవయజనం.

అథ దేవయజనం క్రియాసంఖ్యా, ఆచార్యవరణం శిల్పినమానమేకం, శిలాసంగ్రహణంద్వితీయం బలిదానహోమంచ తృతీయం.

అనదేవతా ప్రతిష్ఠకాలమందు అనగా శిల్పి విశ్వబ్రహ్మసృష్టింపబడినవిగ్రహములను ప్రతిష్టస్వకాలములో దేవయజనం క్రియలుజేయ సమయములో ఆ దేవతావిగ్రహముల సృష్టింపబడిన శిల్పి విశ్వబ్రహ్మల సంతుష్టిచేశి తదుపరిశిలాసంగ్రహణం ద్వితీయం అని విగ్రహప్రతిష్టజేశి మూడోది బలిదానహోమములు జేయుచూ యీప్రకారముగా దేవయజనంలో జెప్పబడియున్న శిల్పి పూజాటూ

కీవినిపించితిని గనుక యింకా విగ్రహానమస్సుచేయు ప్రకరణము చెప్పుచున్నానువినుమని యిట్లనియె.

ప్రథమదండం శిల్పిదండంచ ద్విదండం దాతదండయోః, త్రిదండం దైవదండంచా యత్త్యేతే దండలక్షణం.

ఆలయములోకి వెళ్ళి ప్రథమత సమర్పించినదండం శిల్పివిశ్వబ్రహ్మదనిన్ని రెండోదండము ఆలయమును యేవర్ణస్తులైనా తనస్వకీయవిత్తం ఖర్చుచేసి ఆలయము కట్టించుదాతదనియు మూడోదండమూ ఆవిగ్రహమునకు అర్పితమవును అనియిటుల శిల్పిశాస్త్రము అనుకూలముగా జెప్పబడెనుగనుక దేవతలకందరికిని యీపంచబ్రహ్మలే అధిష్టాధిదేవతలుగానగుపడుచున్నది. వీరలేఆచార్యులయివున్నారు.

శ్లో॥ విశ్వకర్మలేకుజాతా । అన్యకులేనదీక్షితా పుభయోనరకంవ్యాంతి, యావశ్చంద్రదివాకరః॥

తా. విశ్వకర్మవంశస్తులు అన్యకులముచాత దీక్షా అయినటువంటివారున్ను యింకానాలుగుశుశ్రూషలలో యేశుశ్రూషలయినా అన్యకులస్తునికి చేసినా వుభయోనరకంవ్యాంతి వుభయులకునరకమని జెప్పబడుతూవున్నది అనగాను దీక్షయిచ్చినటువంటి అన్యకులస్తుకిన్ని అయినటువంటి విశ్వకర్మవంశస్తునికిన్ని 'యావశ్చంద్రదివాకరః' సూర్యచంద్రాదులు వున్నంతవరకు తప్పదనె శ్లోకార్థము॥ అనియిట్లు మీమాంస మనువిశ్వకర్మవంశమునందు మయవిశ్వబ్రహ్మరైన శ్రీహరి రామలక్ష్మణ భరతశత్రుఘ్న యను నామముల జన్మించె నని జెప్పియున్నది యిట్టి మయవిశ్వబ్రహ్మయగు శ్రీరామమూర్తికి తన స్వజాతస్తులు లేకనా తనకు మూఢత్వముచాత దెలియకనా యిదిన్ని నమ్మశక్యముగాకుండా యున్నది॥ సప్తమస్కంధము॥ ...౧౬...వ॥ వినుము శీలశీలవృత్తియు సుంథవృత్తియు రుతమునియు నయాచితవృత్తి యమృతమునియు

యాచా వృత్తిమృతమనియు గర్షకవృత్తి ప్రమృతమనియు నెన్నదు రిట్టి వృత్తుల జీవించుటమేలు శ్వవృత్తి నీచసేవయని పలుకుదురు సర్వవేదమయుండు బ్రాహ్మణుండు సర్వదేవమయుండు క్షత్రియుండు బ్రాహ్మణక్షత్రియులకు నీచసేవనంబు కర్తవ్యంబు కాదు అని చెప్పియున్నది.

విరాడ్విశ్వకర్మ వామదేవముఖోద్భవుండగు మయవిశ్వబ్రహ్మయైన శ్రీహరికి పెక్కునామంబులుగలవు యీమయనామంబులు జెప్పుచున్నాను వినుమనియిట్లనియె.

దేవమయుండని సర్వవేదమయుండని తపోమయుండని ద్రవ్యమయుండని యజ్ఞమయుండని సచ్చిదానందమయుండని పరబ్రహ్మమయుండని సనాతనుండని చిన్మయుండని హరిమయుండని యిట్టి పెక్కునామంబుల వర్తించెడు యీమయవిశ్వబ్రహ్మ బ్రాహ్మణక్షత్రియత్వమును వహించెను. ఇందువలన?

సురాసురారివినుతం శ్రీవిశ్వకర్మంభజే॥

అనగా దేవతలందరున్ను విరాడ్విశ్వకర్మ స్తోత్రం జేయుచున్నారని భావార్థము॥

అని యీప్రకారము బహుశాస్త్రసమ్మతము జెప్పనాయను॥

సప్తమస్కంధము...౬౩...వ॥ అనియిట్లు యయాతి చరితంబు భగవంతుడును సర్వభూతనివాసుండును శాంతుండును వేదమయుండయిన వాసుదేవునికి నమస్కరించెదనని శుకుండిట్లనియె.

శ్రీశుకులు॥ సర్వభూతనివాసుండనగా సర్వభూతములయందు నిండియున్నవాడు శాంతుండనగా శాంతశమదమాది గుణములు గలిగినటువంటి శాంతమూర్తి వేదమయుండనగా పంచవేదములకు కర్తఅయినటువంటి మయవిశ్వబ్రహ్మ యీమయవిశ్వబ్రహ్మయగు వాసుదేవుండయిన శ్రీవిష్ణుమూర్తిని

గురించి శ్రీశుకులు అనేకులకు స్తోత్ర్యంబు జేసెనుగదా. గనుక విశ్వకర్మ పుత్రనందనులయిన మను మయ త్వష్ట శిల్పి విశ్వజ్ఞ విశ్వబ్రాహ్మణ వంశజులయిన సురా దేవతులకందరికి నీచశేవనంబు కర్తవ్యంబుగాదు॥

క॥ దమమును శౌచము దపమును।
శమమను మార్దవంబు కృపయు సత్యజ్ఞాన
క్షమములు హరిభక్తియు హ
ర్షము నిజ లక్షణము లగ్ర జాతికి నధిపా॥

యిట్టిగుణములు అగ్రజాతమయిన పంచబ్రహ్మల వంశజులయిన సురా దేవతల కందరికిని చెల్లుననే భావము.

శ్లో॥ సర్వేషాం చైతేషాం వేదశ్రుతి విధానతః।
గృహస్థ ఉచ్యతే శ్రేష్టః సత్రీనేతాంభిభర్తిహః॥

అనెడి మనుశ్రుతిరీతిగా బ్రహ్మచర్యము మొదలుకొని నాలుగు ఆశ్రమములు ఈ ఆశ్రమములు అనగా యేవియనిన.

బ్రహ్మచర్యము, గార్హస్త్యము, వానప్రస్తము, సన్యాసమని నాలుగు ఆశ్రమములు గలవు॥

ఇందులకు బ్రహ్మచారిక్రమంబు మౌంజీయును, యజ్ఞోపవీతమును, కౌపీనము, కటిసూత్రం, పాలాశదండ, కృష్ణాజిన పూర్ధ్వపుండ్రము, పవిత్రాదుల నుధరియించి త్రికాలంబులయందును స్నానసంధ్యానుష్టానంబుల జేయుటయు చందనకుసుమతాంబూలంబును స్త్రీభోగంబును వస్త్రభూషణాలంకృతాదివిసర్జించి, నిత్యనయిమిత్తికాది కర్మంబుల ననుసరించుచు సదాచారసంపన్నుండయి పంచగృహభిక్షాడనంబుజేయుచు, గురునకు నివేదనంబుజేసి తాభుజింపవలయు విధియొబ్రహ్మచారిక్రమంబు.

ఉ॥ శౌర్యము దానశీలము ప్రసాదము నాత్మభయంబు తేజముం
ధైర్యము దేవభక్తియును ధర్మగుణార్జనముగామసుఖంబు ధా
చార్యసుకుందసేవలను సత్కృతింబరితోషణంబు సద్వీర్య
మురక్షణంబు పృథివీవరశేఖర రాజచిహ్నముల్.

వ. పిదప ప్రతిగ్రహవ్యతిరిక్తమైన పంచకర్మానుష్ఠానుండయి ప్రతిజ్ఞ వలన భగవంతుని యందతిభక్తిగలిగి అత్యంతధైర్యవంతుడయి మిగులశౌర్య పరాక్రమంబుగలిగి దుష్టనిగ్రహ శిష్టపరిపాలనాది ధర్మములుగలిగి దానలీలావి నోదుండయి సర్వభూతదయాపరుండయి సత్యవ్రతసదాచారసంపన్నుండ యి శాంతశమదమాదిగుణములతోడ సన్యాసియయిన వధూతమొదలయిన జ్ఞాన వంతులకు సేవకుండయి వారల యాశీర్వచనంబులు గయికొని మహాపరిశుద్ధుం డయియుండువాడె క్షత్రియుండనిపించుకొనును యితండె సకలదేవతామయు ని యొక్క కళాతీతంబని జెప్పంబడు యితనివలన సకలవర్ణధర్మములు చెడ కయుండును క్షామంబును చోరాదిభయంబునుగలుగక ధనధాన్యంబులు సమృ ద్ధులుగలిగి గురుశిష్యన్యాయంబులుదప్పక నెల్లరాజ్యంబులనుండు ప్రజలుసం తసించునటుల పాలించువాడె క్షత్రియుండనిపించుకొనును గనుక పంచబ్రహ్మ లవంశజులయిన విశ్వబ్రాహ్మణులు క్షత్రియత్వమును వహించి రాజ్యమును పాలించిరి.

శ్లో॥ హరిశ్చంద్రో నలో రాజా పురుకుత్సః పురూరవః సగరః కార్తవీ
ర్యార్జునషడైతె చక్రవర్తినః॥

యీషట్చక్రవర్తులున్ను పంచబ్రహ్మలవంశమని నెరుంగుము ముప్పది మూడుకోట్ల దేవతలున్ను విశ్వకర్మవలనగలిగినటువంటి వారలేగదా యీక లియుగంబు సావర్ణ సంకరమైనుండుటవలన క్షత్రియులకున్ను పంచాననం వారికిన్ని భేదాభేదములుగలిగియుండెను, గనుక యిట్టివారికి నీచసేవనంబు కర్తవ్యంబుగాదు,

యీకలియుగంబున మానవులు వర్ణసంకరమై వున్నప్పటికి తమకంటె శ్రేష్టమైనవారల గురువుగానుంచుకొని శిశ్రూషలుజేయుచున్నారు. మనువిశ్వబ్రహ్మవంశమునందు వుద్భవించిన మయవిశ్వబ్రహ్మయయిన శ్రీరాములువారు అన్యకులస్థులకు శిశ్రూషలుయెట్లుచేసును,

శ్లో॥ మనుర్మయాతథాత్వష్టా । శిల్పివిశ్వజ్ఞఏవచ । పంచదేవరుషయశ్చేతే । విశ్వకర్మాముఖోద్భవ॥

అనగా విశ్వకర్మ ముఖసంభవులగు మనుర్మయాదులయిదుగురు దేవరుషులని దేవబ్రాహ్మణులని స్కాందపురాణమందు తెలియబడుచున్నదియింకా భాగవతార్థమందున్న పద్యార్థమువినుపించుచున్నాను వినుమనియిట్లనియె.

క. విశ్వాత్ముడు విశ్వేశుడు, విశ్వమయుండఖిలనేత-విష్ణుడజుండే,

విశ్వములోదానుండును, విశ్వముదనలోన తానువెలుగుచునుండున్..

తా. విశ్వాత్ముడనిన్ని విశ్వమునకు యీశ్వరుడనిన్ని విశ్వమయుండువిష్ణువనిన్ని అజుండనిన్నియితనె మయవిశ్వబ్రహ్మమునిన్ని యీభూలోకమందు తానుప్రకాశమానుడయి వున్నాడనిన్ని, ఆమయ విశ్వబ్రహ్మకుక్షియందుయీ విశ్వమంతా నిండియున్నదనిన్ని,

శ్లో॥ యస్యప్రసాదా దహమేవసర్వం । మయోవసర్వపరికల్పితంచ ।
ఇథంవిజానామిసదాత్మరూపం । తస్యాంఘ్రిపద్మ ప్రణతోస్మినిత్యం॥

తా. ప్రసాదమువల్లను అనగా అన్నమయకోశమువల్లను క్షుత్పిపాసలు దహించి యెట్లుబోవుచున్నవో మయోవసర్వం పరికల్పితంచ మయవిశ్వబ్రహ్మమువలన పరికల్పనా అవుతూవున్నదని భావార్థము.

గానత్వష్టబ్రహ్మ సరస్వతీపీఠంబును సృజించి తానుశంఖాచారియనై నామమువహించిన వృత్తాంతంబు దెల్పెదవినుము.

శ్రుతిః॥ విశ్వరూపోవైత్వష్టాః పురోహితాదేవానామాసీదితి, భాష్యంత్వ ష్టరయం పుత్రః త్వాష్ట్రః విశ్వరూపః దేవానా పురోహితః ఆసీత్, అనగా విరాడ్విశ్వకర్మ తృతీయపుత్రుండయిన త్వష్టవిశ్వబ్రహ్మకొమారుండయిన విశ్వరూపాచార్యులు దేవతలకు పౌరోహిత్యుడాటచేత నేగదా అందరున్ను పైతృకమందు దేవస్తానమని జెప్పుదురు దేవతాపౌరోహిత్యముజేసినందునని దేవబ్రాహ్మణులనియందురు గనుక త్వష్టవిశ్వబ్రహ్మ శంఖరాచార్యుల అవుతారమని న్ని యీత్వష్టబ్రహ్మకు సామువేదపాయణంబును సరస్వతీపీఠము యీపీఠమునకు సామవేదశృతిప్రమాణము కాండవవసనం బాహఃస్వత్యమందు అర్ధరాత్రిలో రెండున్నరఘడియఅయిన తరువాత బృహస్పతి విరాట్టుని జెప్పబడిన స్థానంలో.

సరస్వతీపీఠముసామములోనుండు బీజాక్షరయంత్రము.

| | | | |
|---|---|---|---|
| ఓం | క్లీం | గ్రీం | స్త్రీం |
| అం | గ్రాం | మాం | త్రాం |
| హ్రాం | డం | శం | బ్లాం |
| వం | అం | రం | యం |

యీబీజాక్షరములు అందులో రొనిమిదవబీజాక్షరములకు ఏకమాత్రద్విమాత్ర చతుర్మాత్ర అనుయీవర్ణమును ఉదాత్తా అనుదాత్త దీర్ఘస్వరమును యనభైనాలుగురుకు్కలలో నూటాయిఏవదిరొనిమిది ఓంకారమంబు అకార-ఉకార-మకారంబని జెప్పగల ఓంకారంబులలో- అకారం-ఉకార-మకారంబని యీమూటికి అధర్వణవేదమందు కొన్నిరుకు్కలలో.

సరస్వతీపీఠము అధర్వణములోనుండు బీజాక్షరయంత్రము.

| | | | | |
|---|---|---|---|---|
| కం | కం | కం | కం | కం |
| డం | డం | డం | డం | డం |
| ఫం | ఫం | ఫం | ఫం | ఫం |

యీబీజాక్షరములయొక్క శబ్దస్పర్శ - రూప - రస - గంధ - మహాభూతప్రమాణములయొక్క విద్యారణ్యభాష్యమందు చూచిన విరాడ్విశ్వబ్రహ్మ రూపశ్చమముఖం ఉపనిషద్వాక్యమున్ను చెప్పబడియున్నది గనుక యీముప్పదియొక్కటి పంచముఖములలో అఘోరముఖమందు త్వష్టవిశ్వబ్రహ్మ శంఖరాచారి అవతారమెత్తి సరస్వతీపీఠస్థాపనం చేసినది ఋగ్వేదం నూటయిరువదియొనిమిది ఓంకారములలో యీబీజాక్షరములవలన యంత్రస్థానం పీఠస్థాపనం జలస్తంభము మొదలయినదిన్ని నిర్మించెను శ్రీకృష్ణమూర్తి అర్జునకు భగవద్గీతలలో జ్ఞానోపదేశముచేశను అందుయేడో అధ్యాయములో తెలియవచ్చునని తాత్పర్యము.

శృతి॥ ప్రణవస్సర్వవేదేషు, శబ్దేజంపౌరుషంనృషం.

ఓంకారమని చెప్పబడ్డదిగనుక అయిదువేదములకు మూలస్తంభప్రమాణము ముఖ్యమయియున్నది విశ్వబ్రహ్మమనే ఓం. రీం మొదలయినమూలమంత్రం పంచాక్షరములు విశ్వబ్రహ్మనామములయివుండగా.

వ. యనినశిష్యుం డిట్లనియె.

తదనంతరంబా శిష్యుండు లేచి సాష్టాంగదండప్రణామంబు లాచరించి ముకుళితహస్తుండయి వోగురుస్వామీ తామానతిచ్చినసవిస్తారంబంతయు వింటిని గదా యింతావిశ్వకర్మ నందరించుచుండు నాతనినీడవడి కెట్లుండు అద్దానిని దుమనంబున నాటునట్లు తెలియం బలుకవలయునని ప్రార్థించిన నాగురుమూర్తి శిష్యునవలోకించి యిట్లని చెప్పం దొడంగె.

వ॥ వినవోయి శిష్యా.

విశ్వకర్మ నాలుగో కొమారుండయిన శిల్పి విశ్వబ్రహ్మ ఆగస్త్యేన వేదమంతంతా బీజాక్షరములు గాయత్రియనే యిరువదినాలుగు అక్షరములలో తకారమని చెప్పంగా ఆ అక్షరమె విశ్వబ్రహ్మప్రశస్త్యానకు కతకవ్యాగ యింక గాక తే

వరులకు అభివృద్ధ్యవము అయినను వైష్ణవము కలుగజేసె యజుర్వేదము రెండవ అష్టకం అయిదవ పనసయందున్న

శృతి॥ విశ్వరూపో హైత్వష్టాం పురోహితా
దేవానామాశీధిత్రి విశ్వకర్మా జగద్గురుః.

శ్లో॥ బ్రహ్మావిష్ణుశ్చరుద్రశ్చ । భాస్కరేందు సుతాధిపః । సురాసురాశ్చ లోకాశ్చ । విశ్వకర్మేణ నిర్మితః॥

శ్లో॥ విశ్వకర్మామహామూర్తేః । సత్యంభూతదయాపరం । సత్యంసత్యం పునస్సత్యం । సత్యంసత్యంవదామ్యహం పరశివో విశ్వకర్మంచ । సత్యవాక్యంచషణ్ముఖా । పితరఃసర్వదేవానాం । వి[illegible]ంచ పరశివో । విశ్వోత్పత్తికాలేషు । బ్రహ్మనైవిశ్వకర్మణః । విశ్వస్థితాధ[illegible]లేషు విష్ణునై విశ్వకర్మణః విశ్వసంహారకాలేషు రుద్రనైవిశ్వకర్మణః । సమస్తభువనాధారా । మత్యాబ్రహ్మాండమధ్యమం । విశ్వకర్మామహాత్మేరు విశ్వశంఖంప్రతిష్టితం.

క. విశ్వకర్మలేని విశ్వంబు వేరుర, విశ్వకర్మజేశ్వవివిధరచన,
విశ్వకర్మజేశ్వ విశ్వంబుజూడరా, విశ్వదాభిరామ వినర వేమా.

అనియీప్రకారముగా బహుశాస్త్రదృష్టాంతరములూ వుండగా పంచాశత్కోటిభూమండలము పరిపాలనజేశిన క్షత్రియులయిన మనువంశమందు వుద్భవించినవారలయిన త్రిశంఖు హరిశ్చంద్ర నల పురికుత్స సగర కార్తవీర్య శ్రీరామ లక్ష్మణ భరత శత్రుఘ్నయును సురాదేవతులకందరికిన్నీచ శేవనంబు కర్తవ్యంబు సహకాదు

నీచాశ్రయాత్యంగతః అనిపరమామ్నాయము వున్నదిగనుక యీకలియుగము అయిదువేలసంవత్సరములు నీసులయందు మహాత్మ్యముగలిగి నటువంటివారలైయున్నందువలన.

క. బలవంతుడయినవాడే కులహీనుండయిన దొడ్డగుణవంతుడగుః
బలిమియుకలిమియుగలిగిన, నిలలోపల రాజతండె రేయుననవచ్చుగా.

అట్టికులహీనునికి యిట్టిమదములన్నియు యెచ్చియున్నందువలన యీకలియుగం అయిదువేలసంవత్సరములు కులహీనులయినా గుణశ్రేష్టులే యీగుణశ్రేష్టులెవ్వరనిన నానాయోనిరుష్యానులనంబడురు. వీరలజాతంబునెంచనాసరంబులేదు॥

వీరలవంశంబును వేమనశతకంబుగాని జ్ఞానవేదసారసంగ్రహముగాని చిత్తూరిజిల్లా తీర్పుగాని వర్ణాశ్రమతత్వభోధయనే గ్రంథముగాని యింకాకొన్నికొన్ని వేదశృతి యితిహాసకావ్యములు పరిశోధించిచూచినయడల ఋష్యాదుల వంశావళియుం డెలియబడును.

శ్లో॥ నిస్సారపృథివి । నిరౌషఫలతా । నిర్దయారాజా । నీచా మహత్స్యంగతః॥

వ. అనియున్నదిగనుక.

యింకా యీకలియుగ మయిదువేలసంవత్సరములు సాంకర్యము చెప్పెదవినుము వోయినుగుణోత్తమా శుకయోగీంద్రునకు రాజేంద్రుడిట్లనియె.

కలియుగంబగిపాపసంమిశ్రితంబుగాన దురితంబులేలాగున నరులొందకయుండెదరు కాలంబే క్రమంబున నడుచును కాలస్వరూపకుండయిన హరిప్రభావంబు యేలాగునంగానబడు నీజగజ్జలంబు యెవ్విధంబున నిలుచునని యడిగిన రాజేంద్రునకు శుకయోగీంద్రుడిట్లనియె కృతత్రేతాయుగద్వాపరకలియుగంబులను యుగచతుష్టయంబును క్రమంబుగా ప్రవర్తించునందు సత్యదానశర్మదయాశ్రాచ తపోనియమ వ్రతశాంతదాంత వర్ణాశ్రమాచారంబులు మొదలగునవి కృతయుగంబున నాలుగుపాదంబులు పరిపూర్ణంబై ప్రవర్తిల్లు శాంతిదాంతి కర్మాచరణాదిరూపంబగు ధర్మంబు మూడుపాదంబుల రెండవయుగంబు తేజరిల్లు మరియుకజనులు కలయుగంబునాధర్మరహితులు నన్యాయకారులు క్రోధమాత్సర్య లోభమోహాది దుర్గుణవిశిష్టులు వర్ణాశ్రమాచారరహితులను దురాచారులుదురన్నభక్షితులు శూద్రసేవారహితులు నిర్దయులు నిష్కారణవయిరులు దయాసత్యశౌచాదిహీనులు ననృతవాదులు మాయోపాయులు ధన

హీనులు దోషయుక్తద్విజకులునయి పాపచరితులగు రాజులసేవించి జననీజన సుతసోదర బంధుదాయాది సుహృజ్జనులన బరిత్యజించి సురతాపేక్షకులయి కలత్రంబులంజెరుపుచుండెదరు మరియుత్సాహాడాంబరములం బ్రజాక్షయంబగు ద్రవ్యప్రతిగ్రహ విహారులయి యజ్ఞాదికర్మంబులు వర్ణాధర్మపరులయిజేయుచు హీనులయి నశించెదరట్లుగాన నీకలియుగంబున నొక్కముహూర్తంబున నారాయణాస్మరణపరాయణులయి మనంబున శ్రీనృసింహవాసుదేవ సంకర్షణాదినామంబులనం దచలభక్తిదలంచువారలకు క్రతుశతఫలంబులు గలుగునట్లుగావున రాజశేఖరానీమది ననవరతంబు హరిందలపము కలియనేక దురితాలయంబుగాన నొక్కనిమిషమాత్రంబున ధ్యానంబుజేసిన పరమపావనత్వంబునొంది కృతార్థుండవౌదువనిపలికె మరియును.

యీప్రకారముగా యీకలియుగ మయిదువేలసంవత్సరములు సంకరముజరుగబడెను యట్లనిన.

నీచామహాత్మ్యంగతః.

అనిశాస్త్రంయుక్తంబుగాజెప్పబడియున్నందుకు యుగమహాత్మ్యమందు జెప్పబడియున్నరీతిగానున్న నానాయోని ఋష్యాదుల సాంప్రదాయక ప్రభావములవలన యీకలియుగం అయిదువేలసంవత్సరములు మేమెఘునశ్రేష్టులమనిన్ని బ్రాహ్మణులమనిన్ని ఆచార్యులమనిన్ని పౌరోహితులమనిన్ని యీలాగున విద్యావిహీనులయిన మానవులకు బోధజేసి సంకరముచేయబడిరి,

శృతి॥ బ్రాంహ్మణోస్యముఖమాశీత్ - బాహూరాజన్యకృతః - ఊరూతదైస్యత్రద్వైస్యా - పాభ్యాగంశూద్రోఅజాయతః ॥

అనియున్న శృతిజెప్పుకుంటూ యీశృతియందువున్న అర్థమును మరుగుపరిచి మేమే బ్రాహ్మణులమని జెప్పుకుంటూ సంకరముజేయుచుండిరి అట్లానిజమయితే ఋష్యాదులలో వకఋషిఅయినా విరాడ్విశ్వకర్మయనే పరబ్రంహ్మముఖమున బుట్టియున్నట్టునహా అగుపడియుండలేదు, గనుక విరాట్పురు

షుండైన శ్రీరాములవారికి వశిష్ఠుఆత్మజ్ఞాన బోధాచార్యులని వ్యాసప్రోక్తమైన పురాణములయందుగాని యింకా కొన్ని కట్టుకథలయందు వ్యాసప్రోక్తమైన ప్రబంధములయందు భారతభాగవతములయందు దృష్టాంతరముసువడియుండు టవలన ప్రస్తుతము వీరలచె జరుగ బడుటవలన సురాదేవతులకందరకి న్ని యీరుష్యాదులె గురువులని జెప్పుకోవటమువలన నమ్మియుంటూవున్నా రు. అయినప్పటికి యీ విరాడ్విశ్వకర్మసంతతిరైన చతుర్దశ మనువులలో గానిత్వష్టబ్రహ్మసంతతివారలలోగానిపంచబ్రహ్మలలో నెవరిసంతతివారలైన గాని అనామికులకైనా నొకవిశ్వకర్మవంశస్థులను ఆచార్యులుగావున్నట్టువ్యా సప్రోక్తమైన ప్రబంధములగాని కట్టుకథలయందుగాని మిక్కిలి వాసుకగానూ జెప్పియుండలేదే అథవావున్నప్పటికైనా తమయొక్క జీవితంబులకు మోసం బువచ్చునని భావించుకొని సంస్కృతార్థములచె పుండబడినటువంటి విశ్వక ర్మమహాత్తును బయులుపరచక మహావాక్యార్థముల అగోచరముగా దాచుతూ శృతులకు అర్థమును భేధించిజెప్పుతూతమపూజితము జరుగునటుల చేయుచుండిరి

శ్రుతిః॥ మకారశ్చేతి - త్రయోవర్ణః - త్రయోక్షరాణి - త్రయసర్వా ప్రణవః - ప్రకాశతె - అకారోజాగ్రతే - నేత్రేవర్తతె సర్వజంతు - ఉకారకంఠతః - స్వప్నె మకారో హృదిసుప్తితః- విరాడిశ్వకర్మస్థూలశ్చ - హిరణ్యగ ర్భాస్తైజసా - సూక్ష్మశ్చ ఉకార - కారణావ్యాకృత - ప్రాజ్ఞశ్చ - మకార॥

శృతిః॥ ఓంకారప్రభావేదా - ఓంకారంప్రభవాసర్వ - త్రైలోక్యంసచ రాచరం - హ్రాస్వోదహతపాపాని - దీర్ఘరాం -సంపత్ప్రదో - వ్యయః- అర్థ మాత్రాసమాయుక్తాం - ప్రణవో - మోక్షదాయకః ॥

అనెడి ధ్యానబిందూపనిషత్తురీతిగా సచరాచరజగత్తు సర్వమున్ను ఓంకా రప్రణవమునె విరాడ్విశ్వ బ్రహ్మమునందె పుట్టెనుగాన యీ జగత్తుసర్వము న్ను ఓంకారప్రణవమునె విశ్వబ్రహ్మస్వరూపముగానె యున్నది.

యీపరమపురుషుడయిన విశ్వబ్రహ్మచయితన్యము ఆదియంది యందుఅంతః
కర్ణ మందహారమందుకూడగా జీవుడనె పేరువహించెను నీబుధ అంతర్గతము
గు చిదాభాసజీవుడుబాహ్యాగ్రస్తుండయిదృష్టిదరిశనమువలన నీరెంటియందు
ధవళారుణపీతనీలవర్ణంబు లాదియగునానావర్ణస్వరూపములయిన అపంచీ
కృత కార్యసమిష్టివలన సూక్ష్మశరీరమనిపించుకొనును పంచీకృతకార్యమయి
నస్థూలసూక్ష్మకారణతను త్రయములందుకూడి విశ్వతైజస ప్రాజ్ఞరూపముల
నెనయినజీవుడను పశువు పంచవింసతిమాయాపాశములయందు కట్టుబడియు
మ్మాయకులోబడియుండుననిగురుస్వామిబలికిన శిష్యుండత్యంతభక్తి యుక్తుం
డయి యేమనుచున్నాడు.

స్వామీ యీవిరాడ్విశ్వబ్రహ్మమునందు పంచాక్షరములున్ను పంచబ్ర
హ్మలున్ను పంచభూతపంచతన్మాత్రలజననమెట్టిదని వేడిన గురుస్వామియి
ట్లనిరి.

విననోయిశిష్యా పూర్వోక్తంబగు విరాట్పురుషుండయిన విశ్వబ్రహ్మము
యందూహాగలిగి నాయూహవలన కాలముజనించెను దానివలన బిందా
కృతిసంభవించెను నీయాకృతివలన అర్ధచంద్రాకృతిజనించెను దీనివలనకుండ
లాకృతిబుట్టెను దీనివలన దండకాకృతి వుద్భవమాయెను దీనివలన తారకాకృ
తివుద్భవమాయను నీక్రమంబగు పంచాకారమువలన అనగా విరాడ్విశ్వబ్ర
హ్మము యీవిశ్వబ్రహ్మమువలన పంచాక్షరియుంబుట్టె అదియెట్లనిన.

బిందువలన యకారంబుబుట్టెను అర్ధచంద్రాకృతివలన వకారంబు
కుండలాకృతివలన శివర్ణంబు దండకాకృతివలన మకారంబు తారకాకృతివల
ననకారంబుబుట్టెను యీపంచాక్షరములకు పంచబ్రహ్మలు అధిదేవతలయిజ
నించిరి యీవర్ణమువలన ఈశానముఖమున విశ్వజ్ఞబ్రహ్మయు జనించెను నావ

ర్ణమువలన తత్పురుషముఖమున శిల్పిబ్రహ్మయు జనించెను శివర్ణమువలన అఘోరముఖమున త్వష్టబ్రహ్మయును మకారమువలన వామదేవముఖమున మయబ్రహ్మయు నకారమువలన సద్యోజాతముఖమున మనువిశ్వబ్రహ్మయు జననంబయిరి యీవిధంబున పంచబ్రహ్మలవలన పంచతన్మాత్రలుంబుట్టె అదియెట్లంటేని యీశాన్యముఖంబున హకారంబు తత్పురుషముఖంబు నయకారంబు అఘోరముఖంబున రకారంబు వామదేవముఖంబున తకారంబు సద్యోజాతముఖంబున లకారంబు జననంబైయె తదుపరి యీపంచతన్మాత్రలవలన పంచభూతజననమాయెనదెట్లన హకారమునందాకాశభూతంబును యకారమునందు వాయుభూతంబును రకారమువలననగ్ని భూతంబును వకారమందాపుభూతంబును లకారమువలన పృథివిభూతంబును జననంబయ్యె నటుల పంచభూత సమష్టిసాత్విక హంకారమువలన జ్ఞానేంద్రియపంచకంబును తామసహంకారమువలన కర్మేంద్రియపంచకంబును జననము యీప్రకారంబుగాచతుర్దశగుణంబులె అధ్యాత్మికలనంబడును వీటిధర్మములే ఆదిభౌతికమనంబడును వీటిఅధి దేవతలే ఆదిదయివీకమనంబరగు నిట్లుచతుర్దశ దేవతలును వయిననుడివిన విరాడ్విశ్వబ్రహ్మము యను పరమపురుషునికి ఆవరణమయివుందును యీ విరాడ్విశ్వబ్రహ్మమె హిరణ్యగర్భునికి అండాకృతిగాయెవుందును యీహిరణ్యగర్భునికి అవ్యక్తమునకు బీజరూపమైయుండును తదనంతరము పూర్వోక్తమైన పంచభూతములవృత్తాంతమంతయు వింటివిగదాయనిన శిష్యుండత్యంత సంతోషభరితుండయియిట్లనియె.

స్వామీ సద్గురుదేవోత్తమా.

విరాడ్విశ్వకర్మ పంచముఖవివరణ నిర్ణయముగానుండునరీతి తెలుపుమనియడిగిన సద్గురుస్వామి యిట్లనియె.



విరాడ్విశ్వకర్మపంచ ముఖంబులు॥ సద్యోజాతముఖము నకారబీజాక్షరమును విశ్వబ్రహ్మ యుద్భవించెను. తూర్పుదిశ॥

శ్రుతి॥ ప్రాచీదిశాం వసంతఋతూనాం - అగ్నిర్దేవతా - బ్రహ్మద్రవిణం - త్రివృత్స్తోమః - సపంచదశవర్తని - త్రియవిర్వయః కృతమయానాం పురోవాతో వాతః - సానగ ఋషిః - శ్వేతవర్ణము

(శ్రీ) మద్విరాడ్విశ్వబ్రహ్మణోనమః.

| | | | |
|---|---|---|---|
| అకార ఉకారమ కార అర్ధమాత్రల న్యోన్యమేళన విభాగములు | అవిద్యావిద్యానంద తురీయ్యా పాణో న్యమేళన విభాగములు | స్థూలాదిదేహచతుష్ట యాన్యోన్యమేళన విభాగములు | అవస్థాచతుష్టయా న్యోన్య మేళనవి భాగములు |
| జీవచతుష్టయా న్యోన్యమేళనవిభా గములు | ఈశ్వరచతుష్టయా న్యోన్యమేళనవి భాగములు | జీవేశ్వచతుష్టయము క్తచైతన్యచతుష్ట యాన్యోన్యమేళ న విభాగములు | |

అకారము - అవిద్యాపాదము - స్థూలదేహము - జాగ్రతవస్థ - విశ్వుడు విరాట్ - ఓతః ఇదిచేరి బ్రహ్మపేరను - సద్యోజాతముఖము - పృథివి - తత్వము - నకారబీజాక్షరముయందు - నివృత్తికళా - కారణము - మనువిశ్వబ్రహ్మపుత్పత్తి యుద్భవించెను.

విరాడ్విశ్వబ్రహ్మ వామదేవముఖము॥ మకారబీజాక్షరము - మయబ్రహ్మ యుద్భవించెను॥ దక్షిణదిశ॥

శ్రుతి॥ దక్షిణదిశాం - గ్రీష్మఋతూనాం - ఇంద్రోదేవతా - క్షత్రద్రవిణం పంచదశస్తోమః - సాసప్తదశవర్తనిర్దిత్యవాడ్వయః - త్రేతాయానాం - దక్షిణాద్వాతో వాతః - సనాతన ఋషిః - రక్తవర్ణము॥

## శ్రీమద్విరాడ్విశ్వబ్రహ్మణేనమః

| | | | |
|---|---|---|---|
| అకారమున అకారము | అకారమున ఉకారము | అకారమున మకారము | అకారమున అర్ధమాత్రము |
| అవిద్యాపాదమున అవిద్యాపాదము | అవిద్యాపాదమున విద్యాపాదము | అవిద్యాపాదమున ఆనందపాదము | అవిద్యాపాదమున తురీయపాదము |
| స్థూలదేహమున స్థూలదేహము | స్థూలదేహమున సూక్ష్మదేహము | స్థూలదేహమున కారణదేహము | స్థూలదేహమున మహాకారణదేహము |
| జాగ్రత్తలో జాగ్రత్త | జాగ్రత్తలో స్వప్నము | జాగ్రత్తలో సుషుప్తి | జాగ్రత్తలో తురీయ్యము |
| విశ్వునిలో విశ్వుడు | విశ్వునిలో తైజసుడు | విశ్వునిలో ప్రాజ్ఞుడు | విశ్వునిలో ప్రత్యగాత్ముడు |
| విరాట్‌లో విరాట్ | విరాట్‌లో హిరణ్యగర్భుడు | విరాట్‌లో అవ్యాకృతుడు | విరాట్‌లో పరమాత్మ |
| ఓతలో ఓత | ఓతలో అనుజ్ఞాత | ఓతలో అనుజ్ఞైకరసుడు | ఓతలో అవికల్పుడు |

ఉపకారము - విద్యాపాదము - సూక్ష్మదేహము - స్వప్నావస్థ తైజసుడు హిరణ్యగర్భుడు అనుజ్ఞాత ॥

ఇవిఅన్నియుచేరి విష్ణుపీఠము వామదేవముఖము జలతత్వము

మకారబీజాక్షరములు మయవిశ్వబ్రహ్మయుత్పత్తి ప్రతిష్ఠాకళాదండము

విరాడ్విశ్వబ్రహ్మ అఘోరముఖము శికారబీజాక్షరము త్వష్టవిశ్వబ్రహ్మ యుత్పత్తి వర్ణ్యముదళ.

శ్రుతిః॥ ప్రదీచీదిశాం, వసంతరుతూనాం, విశ్వే, దేవా, శావిట్, ద్రవిణం న ప్తదశస్తోమ- సవృయేకవింగం శవత్రనిరి, వతవయో, ద్వాపరోయానాం, పశ్చా, ద్వాతోవాతః, అభువనసరుషిః. పీతవర్ణము.

శ్రీమద్విరాడ్విశ్వబ్రహ్మణేనమః.

| | | | |
|---|---|---|---|
| ఉకారమున అకారము | ఉకారమున ఉకారము | ఉకారమున మకారము | ఉకారములో అర్ధమాత్రము |
| విద్యాపాదమున అవిద్యాపాదము | విద్యాపాదమున విద్యాపాదము | విద్యాపాదమున ఆనందపాదము | విద్యాపాదమున తురీయ్యాపాదము |
| సూక్ష్మదేహమున స్థూలదేహము | సూక్ష్మదేహమున సూక్ష్మదేహము | సూక్ష్మదేహమున కారణదేహము | సూక్ష్మదేహమున మహాకారణదేహము |
| స్వప్నములో జాగ్రత్త | స్వప్నములో స్వప్నము | స్వప్నములో సుషుప్తి | స్వప్నములో తురీయ్యము |
| తైజసునిలో విశ్వుడు | తైజసునిలో తైజసుడు | తైజసునిలో ప్రాజ్ఞుడు | తైజసునిలో ప్రత్యగాత్మ |
| హిరణ్యగర్భునిలో విరాట్ | హిరణ్యగర్భునిలో విరాట్ | హిరణ్యగర్భునిలో అవ్యాకృతుడు | హిరణ్యగర్భునిలో పరమాత్మ |
| అనుజ్ఞాతలో ఓత | అనుజ్ఞాతలో అనుజ్ఞాత | అనుజ్ఞాతలో అనుజ్ఞైకరసుడు | అనుజ్ఞాతలో అవికల్పుడు |

మకారము–ఆనంద – పాదము – కారణదేహము – సుషుప్త్యవస్థ – ప్రాజ్ఞుడు – అవ్యాకృతుడు – అనుజ్ఞైకరసుడు, శివగిరి – రుద్రపీఠము – అఘోరముఖము – అగ్నితత్వము – శికారబీజాక్షరము – త్వష్టవిశ్వబ్రహ్మజనించుట – విద్యాకళా – కుండలాకృతి॥

విరాడ్విశ్వబ్రహ్మ – తత్పురుషముఖము – వకారబీజాక్షరము – శిల్పివిశ్వబ్రహ్మ – వుత్పత్తి – వుద్భవించెను – వుత్తరదిశా।

శృతిః. ఉదీచి దిశాం శరద్రుతూనాం, మిత్రావరుణౌ దేవతా, పుష్టద్రవిణం. ఏకవింశస్తోమ, స్తోత్రిణవతరాని, సూర్యవాఙ్మయ, ఆనందోయానాం, ఉత్తరాద్వాతోవాతః, ప్రత్నసరుషిః. కృష్ణవర్ణము.

శ్రీమద్విరాడ్విశ్వబ్రహ్మణేనమః.

| | | | |
|---|---|---|---|
| మకారము అర్ధమాత్రము | మకారమున మకారము | మకారమున మకారము | మకారమున అర్ధమాత్రము |
| ఆనందపాదమున అవిద్యాపాదము | ఆనందపాదమున విద్యాపాదము | ఆనందమున ఆనందపాదము | ఆనందపాదమున తురీయపాదము |
| కారణదేహమున స్థూలదేహము | కారణదేహమున సూక్ష్మదేహము | కారణదేహమున కారణదేహము | కారణదేహమున మహాకారణదేహము |
| సుషుప్తిలో జాగ్రత్త | సుషుప్తిలో స్వప్నము | సుషుప్తిలో సుషుప్తి | సుషుప్తిలో తురీయము |
| ప్రాజ్ఞునిలో విశ్వుడు | ప్రాజ్ఞునిలో తైజసుడు | ప్రాజ్ఞునిలో ప్రాజ్ఞుడు | ప్రాజ్ఞునిలో కూటస్థుడు |
| అవ్యాకృతునిలో విరాట్ | అవ్యాకృతునిలో హిరణ్యగర్భుడు | అవ్యాకృతునిలో అవ్యాకృతుడు | అవ్యాకృతునిలో పరమాత్మ |
| అనుజ్ఞైకరసునిలో ఓత | అనుజ్ఞైకరసునిలో జ్ఞాత | అనుజ్ఞైకరసునిలో అనుజ్ఞైకరసుడు | అనుజ్ఞైకరసునిలో అవికల్పుడు |

అర్ధమాత్రము, తురియ్యాపాదము, మహాకారణదేహము, తురీయావస్థా కూటస్థుడు, పరమాత్మ, అవికల్పుడు, ఇవి అన్నియుగూడి మహేశ్వరపీఠము తత్పురుషముఖము, మకారబీజాక్షరము, శిల్పిబ్రహ్మ వుత్పత్తిశాంతికళా, అర్ధచంద్రాకారము.

విరాడ్విశ్వబ్రహ్మ ఈశానముఖము యకారబీజాక్షరము.

విశ్వజ్ఞబ్రహ్మోద్భవింపటు॥ పూర్వశిర॥ ఊర్ధ్వదిషగ్ం హేమంత శిశిరుతునాం, బృహస్పతి, దేవతా, వచోశ, ద్రవిణం, త్రిణవత్సోమ, స్త్రియస్త్రియగ్ం శవర్తని పష్టవాద్వయోశి, భూరయానాం - విష్వగ్వాతోవాతః॥ సువర్ణనరుషి॥ శ్యామలవర్ణము.

## శ్రీమద్విరాడ్విశ్వ బ్రహ్మణేనమః

| | | |
|---|---|---|
| అర్ధమాత్రమున అకారము | అర్ధమాత్రమున ఉకారమున | అర్ధమాత్రమున మకారము |
| తురియాపాదమున అవిద్యాపాదము | తురీయపాదమున విద్యాపాదము | తురీయ్యాపాదమున ఆనంద పాదము |
| మహాకారణ దేహమున స్థూలదేహము | మహాకారణ దేహమున సూక్ష్మదేహము | మహాకారణ దేహమున కారణశరీరము |
| తురియ్యమున జాగ్రత్త | తురీయ్యమున స్వప్నము | తురీయ్యమున సుషుప్తి |
| కూటస్థునిలో విశ్వుడు | కూటస్థునిలో తైజసుడు | కూటస్థునిలో ప్రాజ్ఞుడు |
| పరమాత్మలో విరాట్ | పరమాత్మలో హిరణ్యగర్భుడు | పరమాత్మలో అవ్యాకృతుడు |
| అవికల్పునిలో ఓత | అవికల్పునిలో అనుజ్ఞాత | అవికల్పునిలో అనుజ్ఞైకరసుడు |

పైజెప్పిన వెల్లగూడి - సదాశివసీరము - ఈశానముఖము - ఆకాశతత్వము యకారబీజాక్షరము - విశ్వజ్ఞబ్రహ్మవుత్పత్తి - శాంత్యతీతం - కళాబిందురూపం

| |
|---|
| అర్ధమాత్రమున |
| అర్ధమాత్రము |
| తురీయపాదమున |
| తురీయపాదము |
| మహాకారణమున |
| మహాకారణము |
| తురియమున |
| తురీయము |
| కూటస్థునిలో |
| కూటస్థుడు |
| పరమాత్మలో |
| పరమాత్మను |
| అవికల్పునిలో |
| అవికల్పుడు |

ఇది శివతత్వము - శివతత్వమును - శక్తి తత్వమును మీరినదె - నిర్గుణము - విరాడ్విశ్వ బ్రహ్మము - అదినిష్కళము - నిరీహము - నిష్ప్ర పంచము - నిర్మలము - నిరంజనము - నిర్వికా రము - నిరాలంబము - నిర్ముక్తము - నిత్యము - బు ధము - కేవలము - అఖండము - అప్రమేయము అద్వయము - ఆద్యంతమహినము - పరాత్పర ము - అపరోక్షము - స్వయంజ్యోతి - సర్వవ్యా పకమయిన విరాడ్విశ్వ బ్రహ్మము నిండియు న్న నిరతిశయానందము॥

టీ॥ వర్ణత్రయాత్మకమయిన ప్రణవమే విరాడ్విశ్వబ్రహ్మ స్వరూపము - ప్రణవమేవా యస్వరూపము - యీప్రణవమే ఆత్మస్వరూప ము ఆత్మ - విరాడిశ్వబ్రహ్మము - సత్యస్వరూప ము - యీప్రణవమే సర్వకారణ స్వరూపమని వందనము జేయుచున్నారు. యీప్రణవమే వేదశాస్త్రపురాణేతి హాసశృతిస్మ తులకు షట్ శాస్త్రములకు - సకలార్ధ సారహంశములకున్నూ మూలము అనగా ప్రణవమున్ను - నమఃశివాయః - యను పంచాక్షరియున్ను ముప్పది రెండు అక్షరములకున్ను ముందు జెప్పిన వేదములకున్ను బహుశాస్త్ర ఇతిహాసముల కున్ను యీప్రణవపంచాక్షరీ తలకట్టు అయిఉన్నది గదా గనుక సర్వవిద్యల కుప్రణవమను విరాడ్విశ్వబ్రహ్మమే ప్రభువు ఆప్రభువే సర్వభూతముల యందు నిండియున్న పరాత్పరుడు॥ అనగా ॥

శృతి॥ పరబ్రహ్మ - పరంయోగం పరమాత్మ పరమాత్మ్యహం॥ అని యున్న దృష్టాంతరములనుబట్టి ఆపరమాత్మకమయిన తశ్చబ్దవాచ్యుడయిన పరబ్రహ్మము సమస్త భూతములయొక్క హృదయమందు నిండియున్న - పరమాత్మయు ఆపరమాత్ముడె శైలశిఖరాగ్రములందు నివసించియున్నవాడును - అంతశ్చాహ్యహృదయములందు సర్వత్రమూర్తి త్రయాత్మకుడయి యజ్ఞస్వరూపుడయి షట్కార స్వరూపుడయి బ్రహ్మవిష్ణు రుద్రస్వరూపమయి యింద్రుడయి చంద్రాదిత్యాది దేవతలయి ప్రజల పాలించుచున్నాడనితాత్పర్యము - అట్టి విరాడ్విశ్వబ్రహ్మమె ప్రపంచారీనుడు ప్రపంచస్వరూపుడును జీవులను మేపువాడును - సర్వవ్యాపకుడును - విశ్వమునకు కర్తయగు ప్రభువును శాశ్వతుడును - నాశరహితుడయిన - విరాడ్విశ్వబ్రహ్మమునకు వందనములు అట్లు ప్రణవబ్రహ్మచక్రమని కొన్ని గ్రంథములయందు జెప్పబడియున్నది. గనుక యీప్రణవబ్రహ్మచక్రమే విరాడ్విశ్వ బ్రహ్మపంచ ముఖంబులుగా తెలియబడుచున్నది.॥

శృతి॥ విశ్వకర్మే ప్రతీయంతే - అథనిత్యో దేవాపికో విశ్వకర్మా॥

శృతి॥ విశ్వస్యధారణ్యా విశ్వకర్మే దేవాసర్వభూతం - యత్నోపాభ్యం।

శృతి॥ ఆనందం బ్రహ్మపురుషం - ప్రణవీశ్చస్వరూపా - అకారఉకారో మకారయతితా నాకదాల - సముభవతాదో - మితముక్తాముత్యతె - యోగిజన్మసంపారబంధనాల్ ఓంనమో విశ్వకర్మాయితి - మంత్రోపాసకోసాయుద్యంగమిష్యతి॥

శృతి. పితరః పితామహాప్రవర్తతేసవక్తః, పాంతుతే, నోవదశ్మిం బ్రహ్మనస్మిం క్షత్రోస్యాం, మాశిష్యస్యాల్ పురోదాయా, మశ్మిం, బ్రహ్మనస్మిం కర్మంనస్యాం, దేవహూత్యాగం, స్వావిస్వాహా, విశ్వబ్రాహ్మణేయదన్నమమా యీవిరాడ్విశ్వబ్రహ్మము హేమవర్ణము.

శ్రీ నిర్వికల్పోపనిషత్తుస్వయం విశ్వకర్మాచక్రము.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| సర్వసూన్యముయేమీ లేనటు వంటిదిన్ని. | | | నిరాలంబము. ఆధారము లేనటువంటిది. | | | స్వయంభోవిశ్వకర్మణః త్రిగణములు-పంచభూతములు. | | |
| నిర్గుణము, | | | సగుణము. | | | ద్వివిధంవిశ్వకర్మణః. | | |
| విరాడ్విశ్వకర్మ | స్వరాడ్విశ్వకర్మ | సామ్రాడ్విశ్వకర్మ | సద్యోజాతముఖము | వామదేవముఖము | అఘోరముఖము | తత్పురుషముఖము | ఈశానముఖము | పంచముఖములు |
| మంత్రాత్మము | పదాత్మము | వర్ణాత్మము | మనువిశ్వబ్రహ్మ | మయవిశ్వబ్రహ్మ | త్వష్టవిశ్వబ్రహ్మము | శిల్పవిశ్వబ్రహ్మ | విశ్వజ్ఞబ్రహ్మ | పంచబ్రహ్మలు |
| రజోగణము | సత్వగుణ | తమోగుణము | దర్భాసనము న | చిత్రాసనము మః | కృష్ణాసనము శి | వ్యాఘ్రాసనము వా | పద్మాసనము యః | ఆసనములు పంచాక్షరలు |
| తత్వార్థము | భువనాత్మ | కళాత్మము | పృథివితత్వము ౫ | ఉదకతత్వము ౫ | అగ్ని ౫ | వాయువు ౫ | ఆకాశము ౫ | ౧౫ పంచభూతతత్వము |
| అకారము | ఉకారము | మకారము | గుదము | లింగము | నాభి | హృదయము | కంఠము | పంచస్థానములు |
| మంత్రద్వాతీతము | పదత్వాతీతము | వర్ణత్వాతీతము | వసంతరుతువు పాలాశదండ | గ్రీష్మరుతువు అశ్వర్థదండ | సరత్కాలరుతువు మడిదండ | వరషరుతువు మర్రిదండ | శిశిరుతువు చంద్రదండ | రుతువులు పంచదండము |

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| నాదు | బిందు | కళ | పీతవర్ణము | శ్వేత వర్ణము | రక్తవర్ణము | కృష్ణవర్ణము | నీలము | పంచవర్ణం |
| మననము | భువనధ్యానము | కళాధ్యానము | మూడు కోణముల హెూమము | చతుష్కోణ హెూమము | వర్తులాకార హెూమము | షట్కోణము హెూమము | అష్టకోణ హెూమము | పంచ హెూమములు |
| త్వంపద | తత్పదం | అసిపద | లం రజిత యజ్ఞోపవీతం | వం పద్మసూత్రం | రం సువర్ణసూత్రము | యం తామ్రసూత్రము | హాం పశుపత్రి యజ్ఞో | పంచ బీజము పంచ యజ్ఞో |
| జీవాత్మ | పరమాత్మ | అంతరాత్మ | నివృత్తి | ప్రతిష్టాకళ | విద్యాకళ | శాంతకళ | శాంత్యతీత కళ | పంచకళలు |
| జాగ్రత | స్వప్నము | సుషుప్తి | ఆదిశక్తి | యీశాశక్తి | క్రియాశక్తి | జ్ఞానశక్తి | పరాశక్తి | పంచశక్తులు |
| బ్రహ్మ | విష్ణు | శివుడు | కాలమేఘ వాహనము | శత్తాల ద్రోణ మేఘవాహన | మహానీల మేఘ దావానం | కుంభమేఘ వాహనము | వాయుమేఘ వాహనము | పంచ వాహనములు |

పంచభూతములు.

పృథివి - అగ్ని - వాయువు - ఆకాశము - ఈ ౫ న్ను పంచభూతము లనంబడు పంచభూతస్థానములు - పృథివికి - గుదస్థానము - జలముకు - లింగస్థానము - అగ్నికి నాభిస్థానము - వాయువకు హృదయస్థానము - ఆకాశమునకు కంఠస్థానము - పంచభూత రూపములు - పృథివి పీతవర్ణము - జలముశ్వేతవర్ణము - అగ్నికి - రక్తవర్ణము - వాయువ - కృష్ణవర్ణము - ఆకాశము నీలవర్ణము - పంచభూతబీజములు - పృథివికిలంబీజము - జలముకు వంబీజము అగ్నికిరం - బీజము - వాయువుకు యంబీజము - ఆకాశమునకు - హాంబీజము॥ శ్రోత్రము. త్వక్కు - చక్షు - జిహ్వ - ఘ్రాణము - ఈ అయిదున్ను జ్ఞానేంద్రియములనబడును - కర్మేంద్రియము - పంచకము ॥ వాక్కు - పాణి - పాదము - వాయు - ఉపస్థ - యీ అయిదున్ను - కర్మేంద్రియములు॥

వాయుపంచకము॥ ప్రాణవాయువు - అపానవాయువు - ఉదానవాయువు - సమానవాయువు - వ్యానవాయువు - యీ అయిదున్ను ॥ వాయుపంచకములనబడును॥ శబ్దము - స్పర్శము - రూపము - రసము - గంధము యీ అయిదున్ను విషయపంచకములనబడును ॥ యివె పంచతన్మాత్రలు॥

పంచభూతపంచవిశేషవివరణచక్రము.

| భూతములు | ధర్మములు | కర్మములు | వర్ణములు | అధిదేవతలు |
|---|---|---|---|---|
| పృథివి | శ్వేపించట | ధరించడము | స్వర్ణము | మనుబ్రహ్మ |
| జలము | చెప్పడము | పదునుజేయుడము | స్ఫటికము | మయబ్రహ్మ |
| అగ్ని | వెలగడము | కాల్చడము | యెఱుపు | త్వష్టబ్రహ్మ |
| వాయువు | చలించడము | చేర్చడము | పొగ | శిల్పబ్రహ్మ |
| ఆకాశము | బయలయియుండడము | అవకాశమియ్యడము | నీలము | విశ్వజ్ఞబ్రహ్మ |

షడ్విధములవివరణము. మంత్రాధ్వము, పదాధ్వము, వర్ణాధ్వము, తత్త్వాధ్వము, భువనాధ్వము, కళాధ్వము, అని ఆరువిధములు, అందు మంత్రాధ్వము. సద్యోజాతము, వామదేవము. అఘోరము, తత్పురుషము. ఈశానము. హృదయము, శిరస్సు, శిఖ, కవచము, నేత్రము, అస్త్రము, అనిపదునొకవిధము పదాధ్వము, దేవసద్భావేశ్వర మహాతేజయోగాధిపతి ముంచముంచ ప్రథమ ప్రథమ, సర్వ, సర్వ, భూతసుఖప్రద, సర్వసాన్నిధ్యకర బ్రహ్మ విష్ణు, రుద్ర, అనార్చిత, నార్చిత అస్తుతాస్తుత, పూర్వస్థిత, సాక్షి, సాక్షి, తురుతురుపతంగపతంగ పింగపింగ, జ్ఞాన, జ్ఞాన, శబ్దశబ్ద, సూక్ష్మ, సూక్ష్మ, శివసర్వ, సర్వ ఓంనమశ్శివయ, ఓంనమోనమనఃశివ ఓన్నమహాపి ప్రథమప్రథమతేజస్తేజ జ్యోతిర్జ్యోతి అరూప అనగ్ని, అధూమ, అభస్మ, అనాది, నానాధూధూధూ, ఓం భూః, ఓంభువః, ఓంసువః, అనిధననిధనోద్భవ, శివసర్వ, పరాపరాత్మభువనేశ్వర ధ్యానన్నహార, ఒన్నమశివయ, సర్వప్రభః, శివ ఈశానమూర్ధ్నితత్పు

రుషవక్త్ర, అఘోరహృదయ, వామదేవగుహ్య, సద్యోజాతపాద, ఓంనమోగుహ్యాతి గుహగోప్త, అనిధనసర్వయోగాకృతి, సర్వవిద్యాధిపజ్యోతి రూపపరమేశ్వర, పరమేశ్వర, అచేతనాచేతనావ్యోమవ్యోమిన్, వ్యాపింవ్యాపినివ్యోమరూప. సర్వవ్యాపిని, శివానంత, అనాథ, అనాశ్రితా, ధ్రువశాశ్వతయోగ పీఠసంస్థిత నిత్యయోగి, ధ్యానాహార. అని.

ఆవ్యోంకారముల ఏనుబదియొకటి.

వర్ణాధ్వవివరణచక్రము.

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| అం | ఆః | ఇం | ఈం | ఉం | ఊం | ఋం | ౠం | ఏం | ఐం | ఓం | ఔం |
| అం | అః | కం | ఖం | గం | ఘం | చం | ఛం | ఫం | జం | ఝం | ఞం |
| టం | ఠం | డం | ఢం | ణం | తం | థం | ఫం | ధం | నం | పం | ఫం |
| బం | భం | మం | యం | రం | లం | వం | శం | షం | సం | హం | ళం |

అని యేబదియొక్కవిధము। తత్వాత్వార్థము - పృథివి ప్రకృతి - బుద్ధిఅహంకారమున - శ్రోత్రత్వక్ - చక్షుజిహ్వ - ఘ్రాణవాక్ పాణిపాద - పాయూపస్థ గుహ్యశబ్ద - స్పర్శ - రూపరసగంధఆకాశ - వాయువహ్ని జల మాయకాలనియతి - కలవిద్యారాగపురుష - సదాశివ - ఈశ్వరశుద్ధవిద్య శివశక్తి అనితత్వములు - ముప్పదియారు లేక భూతపంచకజ్ఞానేంద్రియ పంచక కర్మేంద్రియపంచక ప్రాణపంచక - శబ్దాది పంచకములును - మనాదిచతుష్టయ పంచకములును - గూడి యిరువదినాలుగు - తత్వములు పయిజెప్పిన ముప్పదియారు తత్వములును - షడ్భావవికార - షట్కోశిక - షడూర్మి - అరిషడ్వర్గములును - జీవత్రయ గుణత్రయ - కర్మత్రయములును - వచనాదానగమన - విసర్గానంద - ములును - సంకల్పాధ్యవసాభిమానావధార గుణంబులును - వైచిత్ర్యాదిచతుష్టయములును దిగ్వాతార్కాది - చతుర్దశేంద్రియములును దేవతలును అనునవి - యన్నియుగూడి తొంబదియారు తత్వములు,



భువనాధ్వము - భద్రకాళి - వీరభద్రత్రిలోచన - నథ - లిప్పువివాహ సంహ్వహత్రిదశేశ్వర - త్ర్యక్షగణాధ్యక్షశంభూ - దౌంష్ట్రనభ్రఫణీంద్ర - ఉదుంబర - గ్రసనమారుతాశన - క్రోధన - అనంతవృషధర - వృషబలిప్రియ భూత - పాలజేష్ట - శర్వసురేశ్వర - వేదపారగజ్ఞాన భూసర్వజ్ఞ ఈశానన విద్యాధిప ప్రవకామద ప్రసాదశ్రీధర రత్నధర - లక్ష్మీధర జటాధర సౌమ్యధర ధన్యరూపనీధిశ - మేఘవాహనకపర్దిపంశిఖ - పంచాంతక - క్షయాంత తీక్షణ - సూక్ష్మవాయువేగ - లఘుశీఘ్రసునాద - మేఘనాద - జలాంతక - దీర్ఘబాహు - జయభద్రశ్వేతమహాబల - పాశహస్త - అతిబల - బలదౌష్ట లోహిత - ధూమ్ర - విరూపాక్ష - ఊర్ధ్వ - కేశభయాంతక - ప్రహారదంష్ట్రి మారణనిరుతి - ధర్మపతి అధర్మపతి వియోక్తసంయ్యోక్త - కర్తవిధాత - ధాతహర - మృత్యుధర్మఅక్షయాంత భస్మాంతక - వజ్రబాహుదహన - జ్వాలన హరిహర - పాతుకపింగళహుతాశన - అగ్నిరుద్ర - త్రిదశాధిప - పినాకి - శాస్త్ర - అవ్యయ - విభూతివర్ధన వజ్రదేహబుధఅజకపాలీశరుద్రవిష్ణుబ్రహ్మహాట కేశ్వరకూశ్మాండ కాలాగ్నిరుద్ర శ్రీకప్నజామకౌమారీ - వైష్ణవబ్రాంహ్మ - భైరవ - కృతఅకృత - స్తలేశ్వర - సుబ్రాంహ్మ్య - ప్రాజేశ - సౌమ్య ఇంద్రగాంధర్వ - యక్షరాక్షసపైశాచ - స్తలేశ్వర - శంఖకర్న కాలాంజన మండలేశ్వర - మహాండద్విండ - శకలాండ - స్తాణు - సర్వాక్షభద్రకర్న గోకిర్న మహాబయ - అవిముక్తరుద్రకోటివస్త్రాపద - భీమేశ్వర - మహేంద్ర అట్టహాస - విమలేశ్వర - నఖిలఅనాఖిల - కురుక్షేత్ర - గయాక్ష - మహాభైరవ - కేదార - శ్రీశైల - మహాకాశ - మధ్యమేశ్వర - ఆంమ్రాదికేశ్వర జలేశ్వర - హరిశ్చంద్ర - అకులేశ్వర - డుందిముడిభారభూతి - జౌషధి - పుష్కరనైమిశ - అపరేశ్వర - అంగుష్టమాత్రార్క - ఈశాన - ఏకేక్షణ - ఏకపింగళఉద్భవ - అభవ - వామదేవ - మహద్యుతిశిఖేద - ఏకవీర - క్రోధఛండ ఏకశివ - అనంత - అజఉమాపతి ప్రచండఏకప్దాదఈశాన - భీమ - ఉగ్రభీమఅనంత - సూక్ష్మశివోత్తమ - ఎకనేత్ర - ఎకరుద్ర - త్రిమూర్తి శ్రీకంఠ శిఖండి - వామజేష్టరౌద్రికాళ కలవికర్న బలవికర్న - బలప్రమథ - సర్వభూత - దమనమనోన్మఅనాశ్రిత - అనాథునఅనంతవ్యోమరూప వ్యాపినిఊర్ధ్వగామిని - రోచిక - మోచిక - దీపిక - ఇందిరశాంత్యతీత - శాంతివిద్యాప్రతిష్టనివృత్తిఅనిభువనము ఇన్నూటయిరువదినాలుగు,



కళాధ్వమని వృత్తి ప్రతిష్ఠా విద్యాశాంతిశాంత్యతీత యనుకళలు అయిదు అనగా యీపంచకళలలో మంత్రపదవర్ణము తత్వపదభువనములును తత్వములలో భువనములు చేరి యున్నవి వీటవిశేషవివరణము కైవల్యనవనీత ప్రథమప్రకరణమున అరువదియొక్క పద్యమున జూడవలెను.

మరియు సర్వమయమంత్రములును సప్తకోటి భేదములుగలవై ఉండగామంత్రాధ్వమందు పదునొకండు మంత్రములు మాత్రముచెప్పుటకు హేతువేమనిన విరాడ్విశ్వకర్మపంచముఖంబులయందె సకలాగమమంత్రములును పుట్టుటచేత సద్యోజాతాదిపంచమంత్రములు ఆమంత్రములకు ముఖ్యములైవున్న విషడంగదేవతామంత్రములువలన పదునోకటిమంత్రములనిచెప్పబడెను.

షడంగములనగా యిట్టిదనిన విరాడ్విశ్వకర్మయొక్క యేకాంగమున్ను పంచబ్రహ్మలయొక్క పంచాంగములున్ను షట్ ఆరుఅంగములాయెను.

శ్లో॥ మకారంమననంచైవ త్రకారంత్రాణముచ్యతే మననత్రాణమిత్యాహు మంత్రమిత్యభిధియ్యతె॥

అనున్యాయముచేత పరబ్రంహ్మము మననమునకున్ను రక్షణమునకును విలక్షణమగుటవలన మంత్రధ్వాతీతమును సర్వదేశవ్యాపకత్వము గలుగుటవలన పదధ్వాతీతమును ఆవర్ణమగుటవలనవర్ణాధ్వాతీతమును సర్వస్వామియగుటవలన భువనధ్వాతీతమును నిష్కళమగుటవలన కళాధ్వాతీతమును అగును

ఆగాము విభాగములు॥ కామికయోగము చింత్యము, కారణము. అజితము, దీప్తము, సూక్ష్మము, జగతి, అంశుమానము, సుప్రబేధక, విజయము నిశ్వాసము, స్వాయంభువము, అనలము, వీరము, రౌరవము, మకుటము, విమలము, చంద్రజ్ఞానము, బింబము, ప్రోద్గీతము లలితము, సంత్తానము, సార్వోత్తమము, కిరణము, భేదము, వాతూలము, అనునవి యిరువదియెనిమిదియును ఆగమములు.

పైనచెప్పిన మంత్రపదభువన పదములును యివియన్ని యీపరబ్రంహ్మయను విరాడ్విశ్వకర్మ పంచముఖంబులలో సద్యోజాతవామదేవ అఘోరతత్పురుష ముఖములు నాలిగింటియందును పైనజెప్పిన యిరువది యెనిమిదియును ఈశానముఖమునందు యెనిమిదియునుగా చెతుర్ముఖబ్రంహ్మ నాలుగుముఖంబులలో నాలుగు వేదములు వుద్భవించ్చినట్లు దృష్టాంతర మగుపడుతూవున్నది.

గనుక అమరపదము స్వయంభూశ్చతురాననః॥ అని జెప్పబడియున్నదిగ

దా, సర్వసూన్యనిరాలంబం స్వయంభో విశ్వకర్మణః॥ యీవిశ్వకర్మవలన గలిగినటువంటివాడేకదా యీచెతురాననుడు యిందువలన చతుర్ముఖబ్రహ్మవలన కొన్ని వేదశృతులు సృష్టించినాడనుటకు యేమి సందియంబును లేదు.

శ్లో॥ లక్షంతూచెతురో వేదాః ద్విలక్షంసూపశాస్త్రయోః షోడశంమాలినీశాస్త్రం ద్వాత్రింశ భరతముత్యతె అబ్జార్ధంశిల్పిశాస్త్రంచ ఆగమంతు చతుర్దశ, ఆయుర్వేదం త్రిలక్షంచ్చ చాతుర్లక్షంచ్చజోతిషం॥

అను ప్రమాణముచేత ఆగమచేత నెరుంగ్గవలయును పాంచ్చరాత్రశాస్త్రాది సకలమయమంత్రములకును యీయాగములె కారణములు.

అట్లానిండియున్నప్పటికి అనుభవించగలందులకు యల్లవారలకు చిక్కనేరదుగదా అయినాకష్టించి అనుభవించినటువంటి మహనీయులు సర్వవ్యాపకులయి వున్నారనే భావార్ధము.

గనుక బ్రంహ్మాండమే ఆకాశము అది బాహ్యర్ధప్రభావమైయున్నది

స్వామీఅంతరార్ధప్రభావమెట్టిది.

అండాండరి తెల్పుగలిగినటువంటి నేత్రస్థానములోనుండు వస్తువనెరుంగుము గనుక చూచేదంతాసాకారం చూపునిల్పితేనిరాకారం అని జెప్పబడియున్నది అదేనిర్గుణస్వరూపము.

పిండాండంబిందువనే పాప పాపమధ్యవెలిగేకళ బ్రంహ్మాండము ఆకళేనిష్కళతానాయనా విరాడ్విశ్వబ్రంహ్మము,

పంచభూతములవివరము పృధివి, ఆపః, తేజువాయువఆకాశం, బాహ్యర్ధప్రభావమైయున్నది. అంతరార్ధప్రభావము, తెల్పుచున్నాను సూక్ష్మగ్రాహివైగ్రహించుమా.

పృధివి. యెరుపు, వుదకంతెల్పు, అగ్ని, నల్పు, సునీలమనేపాపెవాయువ, అందు మధ్యను వెలిగెకళేఆకాశం ఆకళలో నిష్కళతానాయనావిరాడ్విశ్వబ్రంహ్మ అదేనిర్వికల్పను అక్షరదత్రివేణులకు వివరము.

పైనలుపుగంగ్గ, సునీలంఅయిపాపేయమున ఆమధ్యను వెలిగెడి కళేసరస్వతి శృ॥ నీలతోయదమధ్యస్తం॥ అనగా నీలముతోసమానమైనటువంట్టి, తోయ, అనగా వుదకము, అనగానలుపుమధ్యను. శృతి॥ విద్యుల్లేఖేవభాస్వరా అనియుండుటవలన వుదకమైన నల్పుమధ్యను విద్యుల్లేఖప్రభావమైయున్నది,అక్కడనె ముక్తికాంతానివాసం॥ ఆక్కడత్రిమూర్తులకువివరం॥ యరుపుబ్రంహ్మ అకారమాతృకమైన తెలుపువిష్ణువు ఉకారమాతృకమై నలుపుశివుండు మకారమాతృకమైన అదెహృదయకమలం నిద్రసంగమాదులకు అక్కడనేవుద్ధరించెను ఆలోనికళయందే ఝుంకారమయినానాదము ఓంకారమునకు పరమవశమైననిశ్శబ్దం నిష్కళేతానాయనా విరాడ్విశ్వబ్రంహ్మము ఇతసేపరమబ్రంహ్మము యితసేవిశ్వకర్మ॥ అక్కడపంచశక్తులకువివరము॥ యరుపుఆదిశక్తి తెల్పుయిఛ్ఛాశక్తి నల్పుక్రియాశక్తినుసీలమైనపాపెజ్ఞానశక్తిఆపాపమధ్యనువెలిగెడి కళెపరాశక్తి ఆకళలోనిష్కళతానాయనా పరబ్రంహ్మము అక్కడరేచకపూరకాదులకు వివరం రేచకంయరుపు,పూరకంతెల్పు, కుంభకంనలుపు, సూచికం సునీలమైనపాప ఆపాపమధ్యవెలిగె కళెపరాశక్తి ఆకళలోనిష్కళేతానాయనా విరాడ్విశ్వబ్రంహ్మము.। అక్కడమండలత్రయాదులకువివరము॥ నల్పుఅగ్నిమండలము, ఆబిందువెసూర్యమండలము, ఆలోసర్వమండలముగుపడేదె చంద్రమండలమ్ము, ఆలోనిష్కళెయరుకామరుపు యెరుకేతానాయనా॥ శృ॥ విశ్వంనారాయణుడుతత్వరూపకమె సచ్చిదానందాదులు యీసచ్చిదానందాదులు యెట్టివనిన॥ యిందుగలడందులేడని సందేహమువలదుచక్రి సర్వోపగతుండెందెందువెతకిచూచిననందందేగలడు దానవాగ్రణివింటె॥

అని ప్రహలాదుండు సర్వమూ యెక్కడచూచినా అక్కడనెసచ్చిదానందస్వరూపమయి నిండియున్నాడని జెప్పబడియున్నది, గనుక యీప్రకారముగా విరాడ్విశ్వకర్మయొక్క కళేకదా స్వరూపబేధములుగా ప్రకాశిస్తూవుండెను. శృ॥ అంతర్బహిశ్చతత్సర్వం వ్యాప్యానారాయణస్తితః॥ । అంతర్బహిశ్చతత్సర్వం వ్యాప్యావిశ్వకర్మణః॥ పీపీలికాదిబ్రంహ్మ వరియంతరమున్న జంగమస్తావరాదులయందు వ్యాపించియుండెను. సత్తుచిత్తుఆనందములకువివరము॥ సత్తుఅనగాతనలోవెలిగేదీప్తి సత్తుబిందువనె పాపబాహ్యమందు అగువ

డేవస్తువులన్ని చిత్తు అనిత్యమయినచిత్తు ఆనే బిందువయందు నిరంతరం ఆగుపడె పేరుగల వస్తువలన్ని మిథ్యగాయని నిష్కళజ్యోతిస్వరూపం నీవునీవుండేదె ఆనందం. అక్కడ పదత్రయాదులకువివరం॥ త్వంపద ప్రకాశమానమైన తేజస్సుతత్పదమనెబిందువె అసిపదం. అక్కడ నాదబిందుకళలకువివరము॥ పయినాళమందు నాదం ఆనీలంలోను నీలమయినాబిందువేపాప ఆలోకశైతానాయనా పరబ్రంహ్మం అక్కడానాళ్ళకువివరం ఇడాయడమభాగం శివస్తానం కుడిభాగంపింగళ నడ్మినాళం సుషుంన్నయిదిగాక నిత్యమాగణంయెమంటె పైనలువుయడాసునీలంఅయినాపాపెపింగళ ఆనడుమవరిముల్లువంటిసూక్ష్మరంధ్రం. అదే జగజ్యోతియైసర్వపరిపూర్ణమైవెలుపలలోపల ప్రకాశిస్తూవున్నదే సూక్ష్మరంధ్రం అదేవిరాడ్విశ్వకర్మ॥ కం॥చిత్తుభ్రమింగానేనివృద్ధిగానేరదు చిత్తుభ్రమింగకున్న వృద్ధియాను చిత్తువిశ్వకర్మవివరించిచూడరా విశ్వదాభిరామవినురవేమ॥

శ్లో॥ ఓమిత్యేకాక్షరంబ్రంహ్మం బిందురూపప్రకాశగోత్తు బిందురూపస్తితెనాత్మాబ్రంహ్మత్వంచ్చకరిష్యతె॥ యీప్రణవమేవిశ్వబ్రంహ్మము యితనిబిందువె॥ ఆత్మానామేకసంభూతం అనియున్నప్రకారం సర్వాత్మలయందు నిండియున్నపరాత్పరుండయిన శ్రీవిశ్వకర్మయితనేకదా. కం. లోకంబులులోకేశులు లోకస్తులుదెగిన తుదినలోకంబగు పెంజీకటికవ్వల నెవ్వాడేకాకృతి వెలుగునతనినేశేవింతుం॥ తా॥ లోకంబులుఅనగా త్రిలోకములు మొదలుకొని చతుర్దశభువనంబులు లోకేశులుఅనగా త్రిమూర్తులున్నూ లోకస్తులు పెద్దలయినటువంటివారలున్నూ యోగులున్నూ తెగినతుదిఅనగా యిట్టిమహానీయ్యులందరు నలోకంబగు అట్టిలోకంబును మించ్చినపెంజీకటి అతిమహాగాడాంధమయినటువంటిది కవ్వల అనగా యింకాఅంతమపైన నెవ్వాడేకాకృతి వెలుగుతువున్నటువంటి వాడుయెవడో నతనినేశేవింతుం॥ అని యీప్రకారము గజేంద్రుండు నిరామయనిర్వికల్పమయివున్న స్వయంప్రకాశుండయిన పరాత్పరుండయిన శ్రీవిశ్వకర్మను అనేకస్తోత్యంబుజేశి కృతార్థుండాయెను.

గీ॥ వీర్యమెడలినవెనుక వెలదిసుఖమురోత పొట్టనిండినవెనుకబువ్వరోత తత్వమెరిగినవెనుకతగుశాస్త్రములురోత భావభయవిలింగ్గభావలింగ్గ॥

శిఖాపంచమసూన్య చక్రాలకువివరము। నీలముతోకర్మాగవర్ణం యీకపిలవ

ర్ణం ధూమ్రవర్ణం తామ్రవర్ణం యీమూడుశూన్యచక్రాలు। నదుశ్చబ్దంన జీవంచ శివశ్యాపరమాత్మనః అనియోబీజసంయోగంచ తన్మలింగాప్రభూజరయే త్తు నమంరెండుజీవులు శివ రెండు శిముడు య అయిక్యపరచేమాత్ముడు యిది పంచాక్షరికిఅనుభవము శివజీవరూపమేకమాసోరా తానుశివుడన్న యెరుకే లేనిదారయోర శివనామపదమూలుచింత్తానీజంబైతె శివజీవరూపమేకమారయోత తానుశివుడన్న యెరుకలేనిదారయెరా॥

## షడ్చక్రసహస్రార వివరణచక్రము.

| | | | |
|---|---|---|---|
| ఆధారచక్రము<br>గణపతి | స్వాధిష్టచక్రము.<br>బ్రంహ్మరాజసగుణము. | | మణిపూరకచక్రము.<br>విష్ణుసత్వగుణము. |
| అనాహతచక్రము.<br>శిముడుమనోగణం | విశుధచక్రంజీవతమోగుణము. | అగ్నియచక్రం<br>జీవగణం | సహస్రారంకమలంకిరణంలు |

## ప్రణవపంచాక్షర అనుభవవివరణ చక్రము.

| | | |
|---|---|---|
| ఓంకారం విశ్వకర్త్ర | పంచభూతాత్మ్కా | ఓం |
| నకారం మనుబ్రంహ | దశేంద్రియ | న |
| మకారం మయబ్రంహ | మనోపాభ్యాం | మః |
| శకారం త్వష్టబ్రంహ్మ | బుధినాయకం | శి |
| వకారం శిల్పిబ్రంహ | దశవాయువ | వా |
| యఃకారం విశ్వజ్ఞబ్రంహ్మ | త్రిగుణంభవేత్తు | యః |

## జీవేశ్వరఘుట్టవిచారము ప్రకరణము.

టీక-కలశాంబుదములంకలశఘట్టమును అంబుదములంమేఖమును తద్గత జలములకా ఆపుటమేఘనిష్టములయిన జనములన కడబ్రోయం త్యజింపగాను ప్రతిబింబములు లేవందునఅఖండమై భాగింపరానిదై ఒకటియై ఎకమైఇంస్ముల నుండు అన్నిచోట్ల నిండియుండును.

తా-కడవయందుండు జలమును త్యజింపగా ఆకడవయందును మేఘమునందుండు నీళ్ళయందుప్రతిఫలించిన ఆకాశప్రతిబింబములు లేనందున ఆకాశము ఆకారములేనిదియును భాగింపరానిదియును ఏకమైనదియునునై అన్నిచోట్ల సర్వవ్యాపకమైన అంతర్వ్యాపకమైన పరంపరాత్పరుడయిన ఆవిరాడ్విశ్వబ్రంహ్మము సచరాచరజంగమస్థావరాదులయందు నిండియుండుననితాత్పర్యము.

సీ. త్రాడుభుజంగమై స్థాణువపుషుడై రాజిల్లుశుక్తికరజితమగుచు । మరుమరీచకలునిర్మలసలిలంబులై తోడగిమిన్నశితమైతోచుపగిది । నద్వయామలసచ్చిదానందమయుడనైతగునేనుమిగులపెద్దానివలన । దోలుతనసజడదుఃఖాత్మకములైన జగములైకనుపింతుజనులకెల్ల । దృఢతరాద్వైతవిజ్ఞానదృష్టిచేత । పండితులుపూర్ణనిర్గుణబ్రంహ్మమయుడనైననను గాంచినంతనెయ్యదియభావమగునదీయ్య సూమదీయ్యమాయాతమంబు॥

టీ- త్రాడు, రజ్జువు, భుజంగమై, సర్పమై, స్థాణువు, ఆకులు, కొమ్మలులేనిచెట్లు, పురుషుడై, మనుష్యు, రాజిల్లు, శుక్తిక, ప్రకాశించునట్టి, ముత్యపుచిప్ప, వెండియై, మరుమరీచికలు, ఎండమావులు, నిర్మలసలిలంబులై, తేటనీళ్ళయి, తోడరి, పూసికతో, మిన్ను అకాశము, అశితమయి, నల్లనై తోచునగిదింకనబడునట్లుగా, అద్వయుడనై, అద్వయ, తనకంటె, వేరులేనిఅమలనిర్మలమైనసత్, అవస్థాత్రయమునందు నశింపనిచిత్, సాధనానంతర నిరపేక్ష, స్వయప్రకాశముగుజ్ఞానమును, ఆనందనిత్యనిరూపాధిక నిరతిశయ, సుఖమునుమయుండనై స్వరూపముగలవాడనై. తగునేను ఈ చెప్పబడిన లక్షణములుగలిగి, వెలుగుచున్న, నేనుమిగులమిక్కిలి, పెద్దానివలనన్, ఏమాయవలనతొలుతన్ మొదలుజనులెల్ల మనుష్యులకందరికిని అసత్యమైన అసత్, అసత్యమును, జడ, అజ్ఞానమును, దుఃఖశోకము, వీనియొక్క, ఆత్మకములైనరూపములైన, జగములైలోకములయికనుపింతుంకనబడుదునో, పండితులు, విద్వాంసులుదృఢచేతన్, దృఢతర, అతిదార్ఢ్యమైన, అద్వయుతఅఖండమై, విజ్ఞానదృష్టిచేతన్, అనుభవజన్యజ్ఞానదృష్టిచేత, పూర్ణుడం, పూర్ణిసమగ్రమయిననిర్గుణ త్రిగుణాతీతమయిన బ్రహ్మమయుడం మయబ్రంహ్మమునుస్వరూపిని అయిననన్నుం అయినట్టి నన్నుంకాంచ్చినంత్తం దరిశించ్చినమాత్రముననె ఎయ్యది ఏమా అభావమగున్ సూన్యమగునో మదీయ్యామాయాతమంబు్బ మదీయ్య నాసంబంధమైమాయ అననోప్పునోప్పున్ అ

జ్ఞానమనెడు తమంబు చీకటి అదియనూ అదెనుమా అనియీ ప్రకారము మయవి శ్వబ్రహ్మర్షియైన శ్రీరామమూర్తి శీతాదేవితో సర్వంనామహిమయని బోధించియి ట్లనియె. కం॥ మాయా ప్రతిబింబమును మాయధిష్టానపరమ మాయయుగూడన్ మాయాతీతుడైనయీశుడు మాయకుడగునతడు బ్రహ్మమయుడైయుంటం.

శ్లో॥ రూపంరూపం ప్రతిరూపోభభూవ అనికఠోపనిషత్ వాక్యరీతిగానున్న కం॥ మాయాప్రతిబింబములు నామాయయనిబోధించుచున్నాడు వోయినుగుణోత్తమా యింకాయీమయవిశ్వబ్రహ్మ దశావతారములు ఎత్తినవృత్తాంతమంత యుజెప్పుచున్నాన వినుమనియిట్లనియె.

వ ఇట్లుశుధసత్వప్రధాన మాయోపాధికుండును సర్వేశ్వరుండునయిన నేనున్నా వశకృతమాయుండనగుటంజేశి జగంబ్బులూసృజియించ్చి తద్రక్ష ణంబుకోరకు దొల్లిమత్స్యకూర్మ వరాహనారశింహవామన పరశురామావతారం బులుధరయించి దుష్టనిగ్రహశిష్టానుగ్రహంబుగాలించితిననుచు శ్రీరామరూపంబు చెనవతరించి రావణకుంభకర్ణాది రాక్షసుల సంహ్వరించి భూభారంబునివా రించి నింకక్రనిటమీదట బలరామకృష్ణ బౌకలికరూపంబులనే నవతరింపగల వాడ నాచరిత్రంబులు లోకత్రయపవిత్రంబులు ఖవలతాలవిత్రంబులయి యొ ప్పుననిచెప్పి చెండియు॥

అనిమయుండయిన శ్రీరామమూర్తి శీతాదేవికిబోధించ్చిన వినిమరల శీ తాదేవియోమో విన్నవించినదాయెను.

గనుక వోయిభక్తజనోత్తమా శ్రీవిరాట్ పురుషుండైన శ్రీరాములవారికి కే వలం, కులగురోదేవతాచార్యా అని యున్నది. గనుక కులగురువునైన వర్ణ బ్రహ్మయును రేగురువిశ్వబ్రాహ్మణులను తమమనోభీష్టంబువలన షోడశో పచారపూజలు జేయున్నట్లుగా నాగరఖండమను గ్రంధదృష్టాంతర మగుపడు తూ వున్నది యనిన శిష్యుండిట్లనియె, స్వామి ఋషిశ్రేష్టులను సప్తమహాఋషుల నే తెలియబడుచున్నది. వారలెవ్వరనిన, గురు స్వామియిట్లనియె, భూఋషి, భువఋషి, సువఋషీ, జనఋషి, తపోఋషి, సత్యఋషి, భర్గోఋషి, వీరలె న ప్తమహాఋషు లనంబడుదురు.

అనియీప్రకారము మయవిశ్వబ్రహ్మ వృత్తాంతమంతయు వింటివిగదా యనిన శిష్యుండిట్లనియె. దేవా పంచబ్రహ్మల వృత్తాంతమంత దెల్పితిరిగాన సంతసించితిని. ఇట్టి మహానుభావులైన పంచబ్రహ్మల వంశమందు వుద్భవించిన విశ్వబ్రాహ్మణులకు యీకలియుగం మొదలుకొని అయిదువేల సంవత్సరములనుంచి భూషణయును లేక తిరస్కారంబును గలిగియుండుటకు యేమికారణంబు, యీవిశ్వబ్రాహ్మణులకు పంచాననంవారనె నామాంకితము యెటువలెవచ్చెనో దెల్పుమనివేడిన సద్గురుస్వామి యిట్లనియె. సీ. పంచాననోద్భూతపావకజ్వాలలు భూరినభోంతరమెల్ల భూరితముగ। పంచాననుడనగా పంచభూతములసృజియించినటువంటివాడె విశ్వకర్మ। ఆ పంచభూతములనగా పృథివిపంచకమున్ను వాయుపంచకమున్ను। యీపంచభూతములనైఅయిదుతత్వములు యిరువదయిదుతత్వములు ఆయెను। గనుక యిందువలన యీవిశ్వకర్మ।పంచముఖోద్భవులు పంచబ్రహ్మలౌటవలన। యీ విశ్వబ్రాహ్మణులకూ పంచాననంవారని జప్పనాయెను। గనుక యీవిశ్వకర్మను పంచాననుడనే చెల్లును॥ మరియు యీకలియుగను అయిదువేల సంవత్సరములు జరుగబోయ్యేవి దెల్పెదను వినుమా॥ శ్లో॥ అసత్యంపక్షపాతంచ। నిర్మలాన్మంచపంచక। జ్ఞానద్రోహి శృతిద్రోహి। యేతేబ్రహ్మంచపాతకః॥ తా॥ అసత్యమున్ను పక్షపాతమున్ను నిర్మలమైనజ్ఞానులను వంచనద్రోహమున్ను శృతులకు అర్థమును భేదించి చెప్పుటయును యుగమహత్యమునందు శూద్రసేవారతులై వర్తింతురనిన్ని సురతాపేక్షకులై వర్తింతురనిన్ని అనగా వేశ్యాసంభోగపురుషులై వర్తింతురనిన్ని। సురా। కల్లుత్రాగి మాంసభక్షణాదులు చేశి కులములం జెరుపుచుందురనిన్ని। శూద్రులకు సేవారతులై అనగా శూద్రులకు శిశ్రూషలు జేయుచుందురనిన్ని యీలాగు జెప్పబడియున్నది। ద్వాపారయుగ అంత్యమున కలియుగప్రవేశమున॥ బహుకాలమునకు॥ శృ॥ వ్యాసోలుబ్ధకసంభూతో। వశిష్ఠోపూర్వశీసుతః। అనియున్న శృతి అనుకూలముగా। లుబ్ధకసంభూతుండైన వ్యాసులు జన్మించి మయవిశ్వబ్రహ్మవంశసంభవుడైన యొకమహనీయ్యుని వద్ద చేరి।ఆ మహానుభావునికి- ద్వాదశవత్సరములు శిశ్రూషను జేయుచు వేదశాస్త్రపురాణములన్నియు శృతి స్మృతి యితిహాసములన్నియు గ్రహించి। యీమహానుభావునికరుణవలన మంత్రోపదేశమును అయి తాను పరిపూర్ణభావమును జెంది తదుపరి। తాను అకృత్యమార్గముజాయిదలంచి। పంచవేదములను చతుర్వేదములనిన్ని। పంచమూర్తులను త్రిమూర్తులనిన్ని। తానుగ్రహించిన యితిహాసములన్నియు మారుపాటుచేశి! తనవిప్రశబ్దమును యుక్తిప్రయుక్తిగా సందిసంధులయిమిడ్చి॥ బ్రహ్మజ్ఞానంతు బ్రాహ్మణః। అనియుండుటవలన తానుబ్రహ్మజ్ఞానము జెంది తాను బ్రాహ్మణుండననె భావమును వహించకొని తానుతపస్సుజేయుచుండెను। తనగురువుగ్గానైన మహానుభావుని తపస్సుజేయుచున్న వ్యాసులను



జూచి నీవు అఘోరమైన తపస్సు చేయుటయేమి కార్యమని యడుగగా ఆవ్యాసులు
సంతోషభరితుడై నాకు వక వరమునిమ్మని యడిగెను. ఆవరమును వాగ్దత్తముగా తీ
సుకొని తాను తపస్సు చాలించి తాను చేశినవ్యాసప్రోక్తమును నటుల చేశిన మా రు
పాటు యితిహాసములన్నియు నాకు పూజితము జరుగునటుల వరమునిమ్మని కో
రెను॥ అతను విప్రశబ్దమును యిమిడ్చిన శృతి స్మృతి యితిహాసములన్ని జూచి ఆ
శ్చర్యంబునొంది సరే కానిమ్మని వరమును వాగ్దత్తముగా యిచ్చెను॥ శ్లో॥ వ్యాస
ప్రోక్తం మయాదత్తం। విప్రాసర్వత్ర పూజితః॥ కలౌ పంచసహస్రాణి। జాయతె
వర్ణసంకరః॥ అనియున్న పరమామ్నాయముకితిగా। అతను చేశిన వ్యాసప్రో
క్తమును। ఆవ్యాసులకు దత్తము యిచ్చెను। యీదత్తమును యట్లాయిచ్చెనంటే। వి
ప్రాసర్వత్ర పూజితః। సర్వలోకుల చాత విప్రులు పూజింపబడుదురనెను। అదియం
తవరకు యనిన। కలౌ పంచసహస్రాణి। కలియుగము ప్రవేశము మొదలుకొని అ
యిదువేల సంవత్సరములు పూజితము జరుగుననెను। తదుపరి జాయతె వర్ణసం
కరః॥ శ్లో॥ కలౌ పాపినిసంప్రాప్తె। ధర్మహ్రాసోభవిష్యతి। యాతేత్వబ్దసహ
స్రాణాం। పంచ కేషాపినోజనాః॥ చండాలప్రచురంయాంతి యాంతి బ్రహ్మద్వి
షోబలం। బుద్ధిభ్రంశోద్విజాతీనాం విద్యాకర్మాది సంక్షయః॥ శాస్త్రశ్చాపాషం
డాశ్చశిష్టాచార వినాశనం। దుర్భిక్షమవృష్టిర్బహుధోత్పాతదర్శనం। సూ
ర్యాది గ్రహగోళానాం। గతిదోషవ్యసంభవః। గంగామాహాత్మ్యహనీశ్చా! శూ
ద్రోపనయనాదికం॥ కుండగోళకసంతానం। మద్యమాంసపరిగ్రహః- శివకే
శవనిందాచ। శ్రాద్ధాదీనాం విపర్యయః॥ ఆచార్యగురుధిక్కారః। పురోతోవి
సర్జనం। పరనిందాపరస్వత్వం। పరదారపరిగ్రహః! స్త్రీణాంపునర్వివాహశ్చ
శూద్రసన్యాసలక్షణం। దేవతామహిమాలోపో వేదాధ్యయనవర్జనం। వృద్ధ
తాంమంత్రతంత్రాణాం మతవాదదురగ్రహః। సముద్రయానం విప్రాణాం। క
లిదోషాద్భవిష్యతి॥ ఇత్యాదిశృతి సంగ్రహవచనఫలములును మరియు శ్రీనారద
పురాణాంతర్గతంబు నారదప్రభావే॥ శ్లో॥ కలౌత్వబ్దసహస్రాణి యావత్పంచగ
తానిచ। ధర్మోనష్టః కృతిర్నష్టా। జాతోఘోరోవర్ణసంకరః॥ బహూన్యదుష్టపూ
ర్వాణి। శిల్పానివివిధానిచ। చతుష్షష్టిసంసృష్టం। మహామారసముద్భవం॥

అనియున్నదిగనుక యీబృహన్నారదీయోక్తప్రకారము కలియుగం అయి
దువేల సంవత్సరములు వ్యాసవరంబుచేతనే యీదశవిప్రులనెడ్వాజు లందరు
న్నూ వేదపాఠకులై వర్తింపుచుండిరి॥ గనుక యింకా వక వుపమానం జెప్పుచు
న్నాను వినుమని యిట్లనియె॥ విపినందు నొకర్క కపివీరుడు బోయి ప్రాణరక్ష
మై। కపి వుదకంబులు జూప। వుదకంబులు ద్రావి యాకపింవధించి। కపియుద
రంబుచించి। యుదరంబులో వుదకంబులు నించుకపోయెనకర్కటా। కపటికి జేసి
నట్లు వుపకారము కీడగుయెన్ని భంగులం॥ వకనరాధముడు వకయాత్రామార్గ
ము వెళ్లుతూవుండగా। యీమానవుడు దాహంబుగాని కొంతదూరంబుబోయి దా

హంబునకు నోర్వజాలక। ఆచ్చటవక వనాంతరమునకు వెళ్లి యాచల్లదనంబున బరుండివుండగా । యచ్చటనున్న కపిసేనలో సుగుణముగలిగిననొక కపిజూచి యీమానవుండు దాహంబుగొనియున్నాడని । భావించుకొని। యామానవునకు తనసౌజ్ఞచేత నుదకంబులుజూపెను। అంతట యామనుజుండు యాకూపంబునకు వెళ్లి స్నానంబుజేసి దాహంబుదీర్చుకొని యచ్చట నాలోచించుకొని । యాకపింవధించి। యాకోతిపొట్టచించి। తిత్తిగాజేసుకొని। యాతిత్తిలో వుదకంబులు నించుకొని పోయెను నకృటా । కపటికిచేసినట్టి వుపకారముకీడగు యెన్నిభంగులం॥ అని ॥ తద్వతుగనె మయవిశ్వబ్రహ్మ వంశజుడైన మహానుభావుని వద్ద ఆవ్యాసులుచేరి । అతనికి ద్వాదశవత్సరములు శిశ్రూషలుచేసి। సకలశాస్త్రములన్నియుగ్రహించి। యామహానియ్యనిచే కారణంబునుదీసుకొని యావరబలము చేతనింతవడంబడికె జాయెబూనెను ॥ గనుకనోయి శిష్యోత్తమా మరియొకవృత్తాంతము దెల్పుచున్నాను వినుమని యిట్లనియె॥ కైలాసమునుంచి పార్వతీపరమెశ్వరులు భూసంచారమునకువచ్చినసమయములో। శ్వేతబీజరాక్షసుడున్నారక్తబీజరాక్షసుడున్న కైలాసంబునకేగి యాకైలాసగిరిపర్వతంబును నాక్రమించిఅచ్చటశింహాసనాశీనుడై యాకైలాసపట్టణంబునేలుచుసున్న సమయంబునయచ్చటభూలోకమునుంచి పార్వతీపరమేశ్వరుడు కైలాసపట్టణంబునకువెళ్ళగాఅచ్చటా పట్టణంబు ముట్టడిగొనియున్న రాక్షసులున్ను నాయికత్వమువహించిన శ్వేతబీజరాక్షసుడున్నరక్తబీజరాక్షసుడున్ను మరకొందరు రాక్షసబలముచే యుద్ధంబు జాయెబూనిరి॥ అట్టిసమయమునసచ్చిదానంద మయుండైన శ్రీహరివచ్చి యచ్చట యుద్ధరంగంబునుజూచి ఆశ్చర్యంబునొంది తనమాయావిశేషంబునాయారాక్షసులనందరిని వోడింపజేసి శింహాసనాశీనుడైన రాక్షసులయిద్దరినిబహుప్రయాసగావిడిపించి యాకైలాసంబును యీపార్వతీ పరమేశ్వరునకు మరలపట్టాభిషేకంబుగావించి యామయవిశ్వబ్రహ్మయగు శ్రీహరితనవైకుంఠంబుకేతెంచెను॥ గనుక వ్యాసమునితీసుకున్న వరబలముచేత యీకలయిుగము అయిదువేలసంవత్సరములు దశవిప్రులె కలయుగపంచ సహస్రములున్ను ప్రపంచికపూజ్యులైవర్తింపుచుండిరి యందువల్లననగా యీకలయుగ పురుషుడు మనుచక్రవర్తియై క్షత్రియధర్మములేనందువలన ॥ కం ॥ దినదినములు ధర్మంబులు । నయముధరన డగిపోవునాశ్చర్యముగా । వినువర్ణచతుష్టములో ।నెనయుగధనవంతులైన నేలు ధరిత్రీ॥ అనియున్నదిగనుక। యీకలిపురుషుని మహత్యమువలన యీకలయుగము యంతదుష్కృతములు జరుగుచున్నవో అదేప్రకారముగా పంచబ్రహ్మలవంశోద్భవులైన విశ్వబ్రాహ్మణులు మూర్తివంతములుతగ్గి సంకల్పశుద్ధియుండీ లేనట్టుగా ప్రత్యన్నవేషధారులై యుండిరి మరియు॥ శ్లో॥ కృతయుగెమనః సిద్ధి త్రేతాయాం దృష్టిరూపం ద్వాపారే మంత్రసామర్ధ్యం। కలయుగె కరసాధనః॥ అనియుండుటవలన। వెనుకగతించిన యిరువదియొనిమిది మహాయుగంబులన్నియూ ఆవిరాడ్విశ్వకర్మవలనయున్న పంచబ్రహ్మలవలనయున్న చతుర్దశ



మనువులవలనయున్న ప్రపంచికంసృష్టిస్థితిలయ పోషకకర్తృత్వములు కొన్ని యుగంబులలో సంకల్పశుద్ధిచేతనున్నా। కొన్ని యుగంబులలో మనశ్శుద్ధిచేతనున్నా కొన్నియుగంబులలో దృష్టిచేతనున్న కొన్ని యుగంబులలో మంత్రసామర్థ్యతచేతనున్న సృష్టిస్థితిల యపోషకర్తృత్వములు కమ్మనియంటేఁయును॥ కలియుగె కరసాధనా। అనియున్నది గనుక। యీకలయుగంబయిదు వేలపన్నెండు సంవత్సరములు కరసాధనా। చేతులతోజాయవలసివచ్చెను ॥ శ్లో॥ మనూనాంలోహకర్మాణి। మయూనాందారుకర్మణి త్వష్టాకాంస్యకర్మాణి। శిలాకారంతుశిల్పిభి విశ్వజ్ఞస్వర్ణకర్మాచ పంచబ్రహ్మమయింజగత్తు॥అనియున్న శ్లోకానురీతిగా కలయుగప్రవేశము మొదలుకొని పంచసహస్రద్వాదశవత్సర పరియంతం। మనుసంతతివారలు యినుముపనియును మయసంతతివారలు దారుపనియును। త్వష్టసంతతివారలు తామ్రమూదపాత్రలును శిల్పిసంతతివారలు శిలావిగ్రహపనియును విశ్వజ్ఞసంతతివారలు స్వర్ణాలంకారం మొదలుకొని మాంగల్యములును నివియన్నియు యీకాలానుకూలరీతిగానే చేతులతో చాయుడమాతూ యున్నది॥ మరియు॥ మయవిశ్వబ్రహ్మయైన శ్రీవిష్ణుమూర్తి పునహ అవతారమెత్తి వచ్చినపిమ్మట॥ కం॥ భగవంతుండగు విష్ణువు। జగములకెవ్వేళ రాక్షసవధగలుగునం।దగనెవ్వేళలగడయక। యుగయుగమునబుట్టికాచును ద్వ్యమలీలన్ ॥ దుష్టనిగ్రహ శిష్టపరిపాలనంబుకొరకు శంబలగ్రామంబున దేవమయుండైన విష్ణుయశుండగు దేవబ్రాహ్మణునకు పుత్రత్వంబునొంది। దేవతాబృందంబులు నిరీక్షింప। దేవదత్తఘోటకారూఢుండై। దుష్టమ్లేచ్ఛ జనంబుల దనమండలాగ్రంబున ఖండీభూతులంజేయునప్పుడు ధాత్రీమండలంబు। విగతకల్మషజనమండలంబై। తేజరిల్లునంత నరులు దేవమయుండైన విష్ణుమూర్తి ధ్యానపూజాది విధానాసక్తులై నారాయణ పరాయణులై వర్తిల్లెదరట్టి కల్యావతారంబున నిఖలధన్యులయ్యెదరంతట కృతయుగధర్మంబు నడుచుచుండు। చంద్రభాస్కరశుక్రుడు గురువు లేకరాశిగతులైనపిమ్మట కృతయుగంబైతోచు। రాజగతవర్తమానకాలంబులు భవజన్మంబు మొదలు పంచాశాధికోత్తర శతసహస్రహాయనంబులయినందాభిషేక పరియంతంబునుండు నంతట నారాయణుండఖిలదుర్జనరాజధ్వంసంబుగావించి ధర్మంబునిల్పి వైకుంఠనిలయుండగునని జప్పబడుచువున్నది॥ వోయిసుగుణోత్తమా వినుమని యిట్లనియె ॥ శ్లో॥ ధృతిక్షమా స్తేయం। శౌచమింద్రియనిగ్రహంధీర్విద్యా సత్యమక్రోధో। దశకంధర్మలక్షణం। దశలక్షణానిధర్మస్య।యవిద్వాంసమధీయ్యతె। అధీత్యా చానువర్తంతె। తేయాంతిపరమాంగతిః॥ అనెడుమనుస్మృతిరీతిగా॥ శ్లో॥ ఏసత్యంబ్రహ్మసౌచంచ। బ్రహ్మమింద్రియనిగ్రహం సర్వజీవదయాబ్రహ్మ।యేతద్బ్రాహ్మణలక్షణం॥యిట్టిధర్మములు యేర్పడికృతయుగధర్మజరుగబోవునని భావార్థము॥ స్వామీ సద్గురుదేవోత్తమా కృతయుగధర్మయాలాజరుగునో తద్దృష్టాంతమెట్టిది దెల్పుమనిన సద్గురుస్వామి యిట్లనియె వినవోయి శిష్యోత్తమా యీపంచాశతకోటి భూమండలంబంతయు యొకరా

జ్యపట్టాభిషేకంపరిపాలన జాయగలందులకు। నవఖండంతుమేదినీ అనియున్న
దిగనుక॥ యీభూచక్రమంతయును యేకచక్రాధిపత్యం పరిపాలనజాయగ
లందులకు ప్రభువు రాగలండనే తోచబడుతూవున్నది. వెనుకగతించిన కృత
త్రేతాయుగంబులలో దేవమయుండైన శ్రీవిష్ణుమూర్తి దశావుతారములు యేలా
యెత్తెనో పునహాకలయుగ అయిదువేల ద్వాదశవత్సరములు వెళ్లినపిమ్మట
శ్రీవిరాట్ పోతులూరి వీరబ్రహ్మంగారుచెప్పిన భూతభవిష్యద్వర్తమాన కాల
జ్ఞానములో ద్వాదశాక్షరీ మంత్రమును విచారించగా అయిదువేల ద్వాదశవ
త్సరములు గతించిన ప్రథమనామ సంవత్సర శివప్రియమైనటువంటి మాసము
నగమ షోడశకళలు పరిపూర్ణమైనటువంటి పూర్ణిమ వెళ్ళినపిమ్మట బ్ర
హ్మానందస్వరూపుండైన శ్రీవిరాట్పోతులూరి వీరబ్రహ్మంగారు వీరభోగవసంత
రాయులస్వాములవారు నే ఆవుతారమెత్తి ప్రపంచికపరిపాలనకొరకురాగలండ
ని శాస్త్రసమ్మతముగా తెలియబడుచున్నది యిందుకు సందేహంబులేదు। ఇదితె
ప్పితే హీనజాతివానియింట పుట్టుదుననే వట్టున్నది। గనుక నిజపదవాక్యానురీ
తిగా శ్రీ వీరభోగ వసంతరాయులు మనుచక్రవర్తియై క్షత్రియత్వమును వ
హించి పంచాశత్కోటి విస్తీర్ణమైన భూమండలంబంతయు పాలించుననే తెలి
యబడుచున్నది॥ గనుక యిదితప్పదు యిదితప్పదు యిదితప్పదు యిదినిజమని
నమ్మినవారు బ్రహ్మానందమును జెందుదురు। ఇది స్థిరవాక్యమనెనమ్మను। ని
జపదవాక్యమనెనమ్మను। వెనుకటి కృతయుగపనులు పునహా యిప్పుడె దృష్టి
మగుపడుచూ వున్నవి। కృతయుగపనులు యేలావస్తాయున్నవో ఆలాగే
కృతయుగధర్మం నడపగలందులకు వీరవసంతుడు రాగలండని నమ్మను।
సత్యం సత్యం సత్యం వోయిసుగుణోత్తమా నీమనస్సున సంశయమునువిడచి
దృఢీకృతముగా నమ్ముమనిన శిష్యం ఏట్లనెను॥ తదనంతరం బాశిష్యుండు లేచి
సాష్టాంగదండప్రణామంబులాచరించి ముకుళితహస్తుండయి ఓసద్గురుస్వామీ తా
మానతిచ్చిన శ్రీమన్విరాడ్విశ్వకర్మ మనుమయాదుల షడ్విధంబంతయు వింటి
నిగదా నవఖండంతుమేదిని అను భూచక్రమంతయునుండు వివరణదెల్పుమనిన
సద్గురుస్వామియిట్లనెను॥ వినవోయి సుగుణోత్తమా॥ శ్లో॥ ప్రస్టిముష్టిభ వేహస్తం
హస్తంచత్వారికోదనుః। త్రిసహస్రధనుఃకోశం। కోశంచత్వారియోజనం। సహ
స్రయోజనందేశం। దేశంచత్వారిమండలం। సహస్రమండలంఖండం। నవ
ఖండంతుమేదిని॥ తా॥ ఆరుపిడికెళ్ళు- వకహస్తము - అనగావకమూర - యిటు
వంటిమూరలు నలుబదిఅయితె- వకధనస్సు యిటువంటిధనస్సులు మూడు అ
నగా మూడువేలుఅయితె వకకోసు। యిటువంటికోసులు నాలుగుఅయితె - వ
కయోజనము యిటువంటివెయ్యి ఆమడలయితె వకదేశియ్యము। అనగా యి
టువంటినాలుగు దేశియ్యములుఅయితె। వకమండలం అనగా నలుబది ఆమడ
యిటువంటి వెయ్యమండలములుఅయితె- వకఖండము యిటువంటిఖండములు
తొమ్మిదిఅయితె వక మేదిని అనగా యీభూచక్రమంతయునుండు నిర్ణయము॥

# శ్రీ పంచాశత్కోటివిస్తీ

| | | |
|---|---|---|
| మనుష్యశ్వకర్మశతకోటి భూమండలము. | మయవిశ్వకర్మ శతకోటిభూమి. | త్వష్టవిశ్వకర్మ శతకోటిభూమి. |
| భరతఖండము. | ఇంద్రఖండము చరుఖండము. | గభస్తిఖండము నాగరఖండము. |
| భారతవర్షము. | కింపురుషవర్షము. హరివర్షము. | ఇలావృతవర్షము రమ్యకవర్షము. |
| జంబుద్వీపము. | ప్లక్షద్వీపము | కుశద్వీపము. |
| భూఋషి. | భువఋషి | సువఋషి. |
| భూలోకము. భువర్లోకము. | సువర్లోకము. జనలోకము. | తపోలోకము. |
| అతల. వితల. | సుతల. ప్రతల. | మహాతల. |
| లవణసముద్రము. ఇక్షుసముద్రము. | సురాసముద్రము. సర్పిసముద్రము. | దధిసముద్రము: |
| హిమాచలము. హేమకూటము. | నిషధము. నీలము. | శ్వేతము. |
| కృష్ణా. గోదావరి. | కావేరి. నర్మద, | సింధు. భాగీరథి. |

యీ పంచాశతకోటిభూమియని నవఖండమందుండు

| | | |
|---|---|---|
| జలనివాసం ౯ లక్షలు. | స్థావరములు ౨౦ లక్షలు. | క్రిమికీటకాదులు ౧౧ లక్షలు. |

శ్లో॥ నర్మదోత్తరిదేశేషు। సింహాస్థేదేవమంత్రిణి।

మార్తాండే॥ శ్లో॥ భాగీరథ్యుత్తరేతీరే। గోదావర్యాశ్చదక్షిణే।

బ్రహ్మాండపురాణ॥ శ్లో॥ గోదావరీభీమరథి। తుంగభద్రాచవేణికా। తాపీపయోష్ణి వింధ్యస్యదక్షిణేతు ప్రకీర్తితా॥

# ర్వ భూమండలచక్రము.

| | | |
|---|---|---|
| శిల్పివిశ్వకర్మ శతకోటిభూమి. | విశ్వజ్ఞవిశ్వకర్మ శతకోటిభూమి. | ఐదు శతకోట్ల భూమి. |
| తామ్ర ఖండము. వారుణఖండము. | సౌమ్య ఖండము. గంధర్వ ఖండము. | నవ ఖండ ములు. |
| హైరణ్య వర్షము. కురు వర్షము. | భద్రాశ్వ వర్షము. కేతు వర్షము. | నవ వర్షములు. |
| క్రౌంచ ద్వీపము. శాక ద్వీపము. | శాల్మలద్వీపము. పుష్కరగ ద్వీపము. | సప్తద్వీపములు. |
| జనఋషి. తపోఋషి. | సత్యఋషి. భర్గోఋషి. | సప్తఋషులు. |
| సత్యలోకము. | ఊర్ధ్వలోకము. | సప్తలోకములు. |
| రసాతల. | పాతాళ. | సప్తలోకములు. |
| క్షీర సముద్రము. | శుద్ధోదక సముద్రము. | సప్తసాగరములు. |
| శృంగి. | మాల్యవంతము. | సప్తపర్వతములు. |
| గంగ. యమున. | సరస్వతి. | నవనదులు. |

యినభైనాలుగులక్షల జీవరాసుల వివరణ.

| | | |
|---|---|---|
| పక్షిజాతములు ౨౦లక్షలు. | పశువులు ౩౦ లక్షలు. మానవులు౪లక్షలు. | ౮౪ లక్షల జీవరాసులు. |

శుభకర్మనకుర్వీత। నిషేధోనాస్తి దక్షిణె। యితి॥ ఉత్తరఖండమున నర్మద వ్రతోద్వాహాదికర్మాణి సింహాసంస్తేనదూష్యతి॥ భాగీరథీతీరము

| | |
|---|---|
| శ్లో॥ భాగిరథీనర్మదాచ। యమునాచ సరస్వతి। విశోకా చవిహస్తాచవింధ్యస్యోత్తరతస్థితా॥ తస్మాత్కృష్ణగోదావర్యాది। నదీనాం వింధ్యస్యదక్షిణ దేశే స్థితత్వాదయం దేశోదక్షిణ దేశం॥ | దక్షిణఖండము వింధ్య పర్వత సమీపమువింధ్య కుత్తర భాగము. |

గద్య॥ ఇది శ్రీమద్గురు విరాడ్విశ్వబ్రహ్మ అఖిలాండకోటి బ్రహ్మాండోత్పత్తికారణ
విశ్వకర్మ పరాత్పర పాదారవింద జనిత మిళిత గళిత మధురమాధురీధురీణపా
నచిత్తసంయుక్తధీరుండును చతుర్దశభువనవేదవేదాంగ సంశబ్దశబ్దార్థ
విజ్ఞానుండును । స్నానసంధ్యానుష్ఠాన జపతపహోమనిరతుండును త్వష్ట
విశ్వబ్రహ్మకులాంభోనిధి చంద్రుండునునగు ఆభువనసగోత్రసన్నిహితత్వ
ష్టా విశ్వరూప త్రిరూప భద్రదత్త పంచార్షేయ ప్రవరాన్విత అఘో
ర ప్రవర సామశాఖ కాత్యాయనీ సూత్రం సామవేదపారాయణులైన స
రస్వతీపీఠాధికర్తలైన శ్రీమద్వజ్రాల రాజలింగయాచార్యగర్భోద్భ
వులైన స్నానసంధ్యానుష్ఠాన జప తప హోమనిష్ఠాగరిష్ఠులగు రం
బీజాక్షరము వర్తులాకార హోమ గుండమునునగు మానవయజ్ఞము
ప్రణవపంచాక్షరధ్యాన మహనీయులగు శ్రీమద్వేదవేదాంత
ప్రవీణులగు నాగయాచార్య గర్భోద్భవుండగు చంద్రయా
చార్య ప్రణీతంబగునటుల దేవబ్రాహ్మణమహాత్మ్యంబునందు
శ్రీమద్విరాడ్విశ్వకర్మ అవతరించుటయున్న యీవిశ్వ
కర్మవలన మనుమయత్వష్టశిల్పి విశ్వజ్ఞులనే పంచబ్ర
హ్మలు అవతరించుటయున్న వీరికినుండు గోత్రసూ
త్రప్రవరశాఖల నిర్ణయమున్న యీపంచబ్రహ్మ
లు జననమైన విశ్వకర్మ సద్యోజాతాది పంచము
ఖంబులలంకారముగానుండునటుల పంచచ
క్రములున్న యింకా కొన్ని వేదాంతశా
స్త్రసమ్మతముగా శ్రుతిస్మృతేతిహాసో
పనిషత్తు సమ్మతముగానుండు చక్రము
లున్న మొదలైన వేదాంతశాస్త్ర
స్కాందపురాణ నాగరాఖండ
విద్యారణ్య భాష్యమూ
లస్తంభప్రతిహంశము
లంగలధర్మశా
స్త్రంబునుంగ
లమహాత్మ్య
ము,

సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ.

శ్రీమద్విరాడ్విశ్వబ్రహ్మణేనమః.

